# ధ్యేయం

(స్త్రీ పాత్రలు లేని ఏకాంకిక)

# అనార్కలి

(చారిత్రాత్మక నాటిక)

# పూర్వస్మృతులు

( నాటిక )




రచన

డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు

బాపట్ల (గుంటూరు జిల్లా)

పబ్లిషర్సు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# గ మ ని క

ఈ నాటికలు ప్రదర్శించ కోరువారు రచయిత అనుమతి లేనిదే ప్రదర్శించరాదు. అనుమతి కొరకు ప్రదర్శన తేదీ, సంఘము పేరు, కార్యదర్శి పేరు, ఏ సందర్భమున ప్రదర్శించునదీ, తెలుపుతూ పూర్తి చిరునామాతో జవాబుకు పోష్టు ఖర్చులతో సహా పంపవలెను. లేనిచో అనుమతి యిచ్చుట సాధ్యముకాదు.

ఇట్లు
డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు
బాపట్ల (గుంటూరు జిల్లా)

# భయం

## పాత్రలు

1 రామం

2 రంగనాథం

3 కూర్మారావు

4 నరసింహావతారం

5 భూషణం (ముసలాయన)

6 అప్పిచ్చినవాడు

7 పోలీసు

# భయం

[రంగనాథం గది : మధ్యలో రెండు కుర్చీలు టేబుల్ ఉన్నాయి. గది అంతా చక్కగా అలంకరింపబడివుంది. కుడివైపు ఒక ద్వారం ఎడమవైపు ఒక ద్వారం ఉన్నాయి. కుడివైపుద్వారం మరో గదిలోకి దోవ. ఎడమవైపు ద్వారం బయటకు దోవ. గోడకు చిత్రపటాలు తగిలించి వున్నాయి. వాటిలో ఎక్కువభాగం సినిమా స్టార్లవి. గోడమీద ఒకప్రక్క పాతది—బాటిల్స్ కడిగే బ్రష్ తగిలించి వుంది.]

సమయం : ఉదయం షుమారు పదిగంటలు. తెరయెత్తే సరికి రామం ఏదో చదువుతున్నాడు. రంగనాథం అటూ యిటూ తిరుగుతున్నాడు.

రంగ—ఒరేయ్ ! (ఏదో చెప్పబోయి ఆగాడు)

రామం—ఏమిటది ?

రంగ—ఏం లేదులే.

రామం—(మళ్ళా చదువుకుంటాడు)

రంగ—(మళ్ళీ అటూ యిటూ ఒకసారి తిరిగి) ఒరేయ్.

రామం—ఏమిటీ ?

రంగ—ఏం లేదు.

రామం—ఏంలేని కాడికి నన్ను పలకరిస్తా వెందుకూ ?

రంగ—ఏం లేదనంటే అసలు యేంలేదనికాదు. వుండటానికి చాలా వుంది. కాని నీకు మాత్రం ఏంలేదు.

రామం—ఏం? ఉన్నదేమిటో నాకు చెప్పకూడదేమిట్రా.

రంగ—చెప్పకూడదు. చాలా పెద్ద రహస్యం. పెద్దదంటే మహా పెద్దదిలే! ఘమాచు బ్రహ్మాండమంత పెద్దరహస్యం.

రామం—ఏమిటామో. రహస్యమయితే యింతవరకూ నాకెందుకు చెప్పావేమిరా!

రంగ—అది రహస్యంరా!

రామం—రహస్యం గనక రహస్యంగా చెప్పాలి. నాకు ఏ రహస్యం చెప్పకుండా పూరుకున్నావ్ గనక.

రంగ—ఇదసలు చెప్పకూడదనిదిలే. అయితే ఎప్పుడో వకప్పుడు చెప్తాగాని,........ఇప్పుడు కాదు.

రామం—సరేలే; సోది మొదలెట్టావ్-చదువుకుంటుంటే.

రంగ—ఏమిటా చదువు?

రామం—ఏమిటో యింకా తెలలేదు పది పేజీలయింది గాలి తూర్పు నుంచి వచ్చి-దక్షిణంగా పోయింది. చంద్రుడు ఉత్తరాన కనుపించాడు....అనే తప్ప యింకా హీరోయిన్నీ కూడా లాక్కురాలే! ఎంతసేపు చదివినా తలనొప్పేగాని ఆ Postman రాడు.

రంగ—Postman!! నీకెందుకు?

రామం—వాడికోసమే వచ్చా-వాడికోసమే కూర్చున్నా!

రంగ—ఈ పుస్తకం చదువుతూ .... వాడికోసం యిక్కడ కూర్చున్నావా.

రామం—ఆ!, నీ ఎడ్రెసుకు ఉత్తరం రాయమని రాశాను. ఆ పుత్తరం వస్తుందేమోనని వచ్చి కూర్చున్నాను.

రంగ—నా అడ్రెస్ యివ్వట మేమిటి?

రామం—ఆ, వ్రాస్తే రహస్యమయిన ఉత్తరం లే.

రంగ—రహస్యమా! అదేమిట్రా!

రామం—ఆ. రహస్యమే-నీరహస్యం నాకు చెప్పావేమిటి నా ఉత్తరం రహస్యం నీకు చెప్పేందుకు.

రంగ—నా రహస్యం చెప్పేది కాదుగాని నిజంగా రహస్యంరా.

రామం—నా రహస్యమూ చెప్పేది కాదు. అందుకే రహస్యంగా నీఅడ్రెస్ యిచ్చా.

రంగ—ఏడిశావ్. ఉత్తరం వస్తే నేను చింపి చూసేవాణ్ణి ఏమి చేసేవాడివి?

రామం—చింపి చూస్తే రహస్యం అని తెలిసేది. వెంటనే మూసేసేవాడివి. రహస్యంగా వ్రాయమని రాశాగా ఆ అమ్మాయికి. రహస్యంగా వ్రాస్తుంది.

రంగ—ఓహో అయితే అమ్మాయి వ్రాస్తుందన్న మాట-

రామం—అరెరె-చెప్పేశానే!

రంగ—ఆ! చెప్పేశావ్, చూశావా! నే చెప్పలేదు - నావుత్తరం సంగతి. (కొంచెం ఎక్కువ సంతోషంగా అంటాడు)

రామం—నీదీ ప్రేమ ఉత్తరమేనట్రా?

రంగ—(తెల్లపోయి) ప్రేమ ఉత్తరమని నేనెప్పుడు చెప్పాను?

రామం—ఆ! చూశావా! నువ్వు చెప్పకుండానే నే కనిపెట్టివేశాను.

రంగ—ఎట్లా కనిపెట్టావురా?

రామం—అట్లా నీ మొహం చూస్తున్నాను. కనిపెట్టేశాను.

రంగ—ఏడిశావ్-ఏం కనిపెట్టలేదు. నాది సామాన్యపు ప్రేమ పుత్తరం అనుకున్నావేమిటి? బహు మేలైన ప్రేమ పుత్తరం.

రామం—ప్రేమ పుత్తరం అన్న తర్వాత మేలైనదే అవుతుంది. కీడైన పుత్తరం ప్రేమఉత్తర మెందుకవుతుంది.

రంగ—దాని సంగతి నీకు తెలియదులేరా! నా పుత్తరం చాలా అందంగా వుంటుంది. రంగు రంగుల పువ్వులూ, రకరకాల లతలతో అలంకరించి వుంటుంది. (కవరు చింపగానే అత్తరు సువాసన గుమాయిస్తూ వుంటుంది. మధ్యలో నాకంటే మంచి దస్తూరితో, "ప్రియుడా" అనో, "ప్రియతమా" అనో కనిపిస్తుంది. క్రిందపుత్తరంలో "ఇట్లు మీ చకోరం" అనో "చరణదాసి" అనో,)......

రామం—ఏడిశావ్-ఉత్తరం యింకా రాలేదు. నువ్వు చూడలేదు. ఇవ్వన్నీ నీకెట్లా తెలుసు.

రంగ—తెలుసు లేరా! ఎట్లా అయితే ఏం? తెలుసు నన్నానుగా!

రామం—ఎట్లారా! కాస్త బుర్ర ఉపయోగించు. postman రాలేదు. ఆ పుత్తరం ఎడ్రస్ కూడా నువ్వు చూడలేదు. కవరు చింపలేదు. ఉత్తరం కళ్ళతో చూడలేదు. ఎట్లా తెలుస్తుందంటా!.

రంగ—తెలుసునని చెప్తే నమ్మవేం—నే నుత్తరం రాస్తూ లతలూ పువ్వులూవున్న కాగితంమీద సెంటుపోసి దానిమీద జవాబు వ్రాయమని నా పుత్తరంతోపాటు పంపాను.

రామం—అదే!

రామం—ప్రేమ ఉత్తరమే!

రంగ—ఆ! "ప్రియమయిన ఎవరో తెలియనివారికి మీరు రోజూ యిటు రావటం చూస్తున్నాను. మీరు రోజూ నేను చూస్తుండటం, చూస్తున్నారు. ఏం చూసి ఏం ప్రయోజనం గనక. ఉత్తరం రాసి గోడమీదినించి పడేయండి. జవాబు రాస్తాను." అని వుంది. గబగబా పోయి రెండు శుభలేఖలు కొని సెంటుపూసి ఒక దానిమీద వుత్తరం వ్రాసి రెండోదిగూడా కవరులో పెట్టి చీకట్లో గోడమీదినుంచి విసిరేశాను. ఆ అమ్మాయి చూస్తూ వుండగా?

రామం—ఓరి!! ఎప్పుడూ?

రంగ—మొన్నరాత్రి! ఇవ్వాళ Post లో జవాబు రావాలి.

రామ—నేను రాసింది మొన్నరాత్రే: నాకూ యివ్వాళ జవాబు రావాలి.

రంగ—వస్తుంది. Postman సంచీ అంతా ఘుమఘుమాయిస్తుంటే వస్తుంది.

రామం—నువ్వు ఎడ్రెస్ యిచ్చావా?

రంగ—ఓ! ఎందుకైనా మంచిదని రంగనాథం $\frac{7}{13}$ శ్రీకంఠం వీధి అని యిచ్చా.

రామం—నేనూ అదే యిచ్చా.

రంగ—అది సరే! రామం C/o రంగనాథం అని యిచ్చావాలేదా!

రామం—లేదు ఎందుకూ? నాది కాకపోతే నీదేగా? నువ్వూ మొన్ననే వ్రాస్తావని నాకేం తెలుసూ.

రంగ—ఏడిచినట్టుంది: ఎందుకైనా మంచిదని రాయక్కర్లే.
రామం—ఇట్లా అవుతుందని నాకేం తెలుసా? మొన్న నీ దగ్గరకు వస్తూవస్తూ గోడమీదినుంచి పారేశాను.
రంగ—ఇక్కడికి వస్తూనా? అంటే ఈ వీధిలోనేనా ఏమిటి?
రామం—ఈ వీధిలోనే.........నువ్వా—? నీదే వీధిలో—
రంగ—ఈవీధే.
రామం—కొంపదీసి.........
రంగ—కొంపదీసి.........
రామం—జవాబు వస్తుందిగా—రానీ.
రంగ—జవాబు వస్తుంది సరే—నీవుత్తరంలో పేరన్నా వ్రాశావా?
రామం—లేదే! "ఎందుకులే యెందుకైనా మంచిదని" రాయలే.
రంగ—సరి! నేనూ—వ్రాయలేదే.!!

[బయట post అని కేక—ఇద్దరూ బయటవైపుకు పరుగెత్తుతారు. లోపలకు రెండు కవర్లు పడతాయి. ఇద్దరూ అంది పుచ్చుకుని రెంటిమీద ఎడ్రెసులు చూస్తారు.]

రంగ—చంపేశావురా! రెంటిమీద ఒకే ఎడ్రెసువుంది.
రామం—అవును. ఎవరిదేదో ఎట్లా తెలుస్తుంది.
రంగ—ఆగు—(రెండు కవర్లూ వాసన చూసి) రెండూ జిగురు కంపే కొడుతున్నాయి
రామం—చింపి చూడు, నీది కాకపోతే చదవకుండా యిచ్చెయ్యి.
రంగ—నావుత్తరం నాకు గుర్తేలే. రంగు రంగులు కనిపిస్తూనే వుంటాయి. (ఇద్దరూ చూసి చదువుతారు—చెరోవైపుకివెళ్ళి. తెల్లబోతారు)

రంగ—ఆ ఉత్తరం నీదేనా!

రామం—ఏం? ఆ ఉత్తరం నీది కాదా?

రంగ—కాదు!

రామం—లతలూ పువ్వులూ దానిమీదవున్నాయే!

రంగ—ఉన్నాయి. ఈ కాగితం నాదే. కాని ఉత్తరంలో సంగతులు అతకటం లేదు.

రామం—నా ఉత్తరానికి సంగతులు అతకటం లేదు.

రంగ—బహుశా ఏదో పొరపాటే! ఏదీ? అది యిట్లా యియ్యి (ఇద్దరూ ఉత్తరాలు తిరగమార్చుకుని విడివిడిగా చదువుకుని తెల్లపోతారు)

రంగ—అబ్బే! ఇదీ నాదిగాదురా!

రామం—ఇది నాదీ కాదు.

రంగ—అది నీదే—ఇది నాది కాదు.

రామం—ఈ రెండూ నీవే? ఏదీ నాదికాదు. ఈరెండూ ఒకే కాపీ లాగున్నాయి.

రంగ—అల్లాగే వున్నాయి ఏదీ చదువు చూద్దాం.

రామం—(చదువుతాడు) శ్రీ x y z గారికి

మీ ఉత్తరం అందింది. ఉత్తరం రాసినవారు మీపేరు వ్రాశారు కాదు. పేరు తెలియకుండా ఎట్లా ప్రేమిస్తాననుకున్నారు. దీనిలోనే మీ తెలివితేటలు కనపడుతున్నాయి. ఏదైనా నాకో మేనమామ వున్నాడు. కాస్త మోటుమనిషి. కొంచెం తాలింఖానాలో తిరిగినవాడు అతడు నన్ను ప్రేమించి పెళ్లి

చేసుకోమంటున్నాడు మానాన్నకా సంబంధం యిష్టం లేదు. కాని వచ్చిన యితర సంబంధాలన్నీ యీ వస్తాడు మామ బెదరగొట్టి చెదర గొడుతున్నాడు. కుదిరి రానివ్వటం లేదు. మిమ్మల్ని రోజూ చూస్తున్నాను, చూస్తుంటే మీరు నన్ను తెగ ప్రేమించినట్లు కనిపిస్తున్నారు."

రంగ—ఆ! ఏమిటది? మళ్లీ చదువు?

రామం—"మీరు నన్ను తెగ ప్రేమించినట్టు కన్పిస్తున్నారు"

రంగ—ఈమాట నాకు పడలేదే!

రామం—ఈ కాగితం నీదేగా? ఇది పడింది నీకే?

రంగ—ఊ! చదువు.

రామం—(చదువుతూ) చూడటానికే మీరు వస్తాడులాగ కనిపిస్తున్నారు కనక మీ ప్రదేశకు మా మేనమామగాణ్ణి పంపిస్తాను. వాడి ఎముకలు మీరు విరగగొట్టండి. లేదా! వాడే మీ ఎముకలు విరగగొడతాడు. ఎవరి ఎముకలు విరక్కపోతే వారిని పెళ్ళాట్టానికి నేను సిద్ధం.

ఇట్లు

అనూరాధ

రంగ—ఇదేమిట్రా?

రామం—ఏదో పూర్వకాలం అనాగరికపు రోజుల్లో పెళ్ళికూతురు కోసం పందేలుండేవిగాని ఈ రోజుల్లో ఎక్కడాలేవే!

రంగ—అదేదో విమర్శకుడన్నట్లు సన్నివేశం చాలా అసహజంగా వుంది.

రామం—ఆ వచ్చేవస్తాయి అసహజంగా లేకుండా సహజంగానే నీ ఎముకలు విరక్కొట్టతాములే.

రంగ—ఇదేమిటి? నీ ఎముక ఎంటావ్, నిన్ను మాత్రం వాడు కొట్టడూ?

రామం—నన్నెందుకు కొడతాడూ? ఈ వుత్తరం నాదికాదుగా—దీన్లో నా ఎడ్రెస్ ఏదీ?

రంగ—ఇలా తప్పించుకోటానికా? నా ఎడ్రెస్ యిచ్చింది.

(బయట ఎవరివో కేకలు వినిపిస్తాయి "రంగనాథంగారూ, రంగనాథంగారూ" అని)

రంగ—ఎవరది?

[కూర్మారావు అనే వస్తాదు వస్తాడు]

కూర్మా—నేనండీ! కూర్మారావును.

రంగ—కూర్మారావా!!

కూర్మా—ఆ! కూర్మారావునే; ఈ మధ్యకు స్త్రీపోటీల్లో ఛాలెంజిచేసా ఊళ్ళో. తెలియదూ?

రంగ—తెలియదే!

కూర్మా—ఆ-నూటఎదహార్లు ఛాలెంజీ పోటీ. కలెక్షన్ చెరిసహం.

రామం—తెలియదులెండి. కాని యిట్లా ఎందుకు దయచేశారు?

కూర్మా—ఏంలే! మరేంలే! Postman వచ్చి వుత్తర మిచ్చాడండీ?

రామం—ఇచ్చాడు Postman కోసంవచ్చారా? అతెటో వెళ్లాడు.,

కూర్మా—కాదండి! నేను రంగనాథంగారికోసం వచ్చా. మీ యిద్దర్లో రంగనాథం ఎవరూ ?

రంగ—నేనూ! కాని నేనేం ఛాలెంజీ చెయ్యలేదే ఎవర్నీయిదా ఛాలెంజీ చెయ్యలేదు.

కూర్మా—చెయ్యలేదులెండి. కాని మీకు యివ్వాళ ఉత్తరాలొచ్చాయిగా ?

రంగ—వచ్చాయి.

కూర్మా—ఏం లే. మీ ఎడ్రెస్‌కు నాకో పుత్తరం వచ్చివుంటుంది.

రంగ—నా అడ్రస్‌కు మీకో పుత్తరం రావటం ఏమిటి ?

కూర్మా—అదంతావుందిలెండి! నాకీవూరు కొత్త. వేరే ఎడ్రెస్ దొరక్క మీ ఎడ్రెస్ యిచ్చొచ్చా. వచ్చి తీసుకోవచ్చుగదా అని.

రామం—వీడి ఎడ్రెస్ మీకు ఎట్లా దొరికిందీ ?

కూర్మా—ఎడ్రెస్ దొరికేదేమిటండీ; ఆ వాకిట్లోలేదూ బోర్డు. అది చూశాను. ఏదో మన బోటి కుర్రకారే అనుకున్నాను. ఇచ్చేశాను. ఆ సమయం అట్లాంటిదిలెండి. అనుకోకుండా ఎడ్రెస్ యివ్వాల్సి వచ్చింది. నాలాగా సరదా అయిన వాళ్ళే గనక చెప్తున్నాను. మళ్ళా ఎక్కడా అనకండి. ఈ వీధిలో-అక్కడ-ఓ అమ్మాయి వుంది. నేనూ రోజూ యిటు తాలింఖానాకు వెళ్తా. ఆ అమ్మాయి రోజూ నావంక చూస్తోంది. చూస్తోంది గదా అని నే నిటేవెళ్తున్నారోజూ వెళ్తూ-వూరుకో బుద్ధిపుట్టక ఒక రోజున "యిట్లా" అన్నా. ఆ అమ్మాయి నవ్వింది. ఇక

సరే! ఆ రోజంతా అక్కడే తారట్లాడా. సాయంకాలం చీకటి పడ్డ తర్వాత ఆ అమ్మాయి, వాళ్ళ యింటి ముందు తోటలో తిరుగుతూ తిరుగుతూ—ఒక రాయికో వుత్తరం కట్టి పడేశింది. అది ఖర్మం చాలక ఆ దారినపోతున్న వాడెవడో భుజంమీద పడింది. వాడు రాయితీసుకుని—పరుగో పరుగు. వాడి వెంట పడి లాక్కుందామని పరుగెత్తబోయా—ఇంతలో నామీద మరోరాయి, దానికో వుత్తరంతో పడింది దాంట్లో ఏం రాశిం దనుకున్నారూ? ఓ—ప్రేమంతా చిలకరించింది. నీ ఎడ్రెస్ యియ్యి అని వ్రాసింది. ఏ ఎడ్రెస్ యివ్వనూ! నే నుంటున్నది సత్రంలో నామెకు సత్రం ఎడ్రెస్ యివ్వటం మర్యాద కాదనుకొని, మీ ఎడ్రెస్ యిచ్చా.

రామం—అయితే....ఇప్పుడొచ్చిన వుత్తరం యీాయనిదిరా!

రంగ—ఆరెండుత్తరాలూ—యీాయనివే! ఇదిగో మీ వుత్తరం.

కూర్మా—ఇవ్వండి యివ్వండి.

(రంగనాథం యివ్వగా కూర్మారావ్ తీసుకుని చదువుతాడు)

రంగ—మాదనుకొని చింపాం; మరేం అనుకోకండి.

కూర్మా—అలాగే—(ఉత్తరం తీసి చూశి) చూశారా సువాసన—ఎంత మంచి కాగితంమీద వ్రాశిందో ప్రేమ ఉత్తరమంటే యిట్టా వుండాలి. (చదువుతూ—తెల్లబోతాడు)

కూర్మా—ఇదేమిటీ?

రామం—కుస్తీపోటీ! చాలెంజి! (పందెం పదహారేళ్ళ పడుచు.)

కూర్మా—ఛీ! ఇదేం పోటీ! (బయట "రంగనాథంగారూ రంగ

నాథరేగారూ" అనికేక వినిపిస్తుంది. అందరూ అటుచూస్తారు)

రంగ—ఎవరది ?

["నేనండీ" అంటూ నరసింహావతారం వస్తాడు]

నర—ఆ! ఉత్తరం చదువుకున్నారా ?

రంగ—ఏ వుత్తరం ?

నర—ఇప్పుడు మీకు వచ్చిందే! postman తెచ్చి యిచ్చాడే!

రంగ—అదా! అది నాకు కాదుగా!

నర—మరి వీరికా! (రామాన్ని చూపుతాడు)

రామం—నాకూ కాదు.

నర—కాదంటారేమిటండీ! రంగనాథంగారు మీరు కాదూ?

రామం—రంగనాథం వీడూ—కాని వీడి ఎడ్రెస్ వారు యిచ్చారు. ఉత్తరం వచ్చింది వారికే.

నర—వీరికా ?

రామం—ఆ! వారికే,—కూర్మారావుగారు.

నర—ఊం!

కూర్మా—ఊఁ!

నర—అయితే రా కుస్తీకి ?

కూర్మా—ఓ బస్తీమీద సవాల్.

నర—అయితే కానీ.... జై వీరాంజనేయ.

రంగ—కాని....కాని....ఇక్కడ కుస్తీపడతారా?

నర—కుస్తీపట్టటమేమిటి! ఎముకలు విరగకొట్టేస్తాను.

కూర్మా—ఏడిశావ్! రా, కండలు పిండేస్తాను.

రంగ—కాని యిది నాగడ—ఇక్కడ కుస్తీపట్టే....ఎట్టా!!

నర—ఛీ వూరుకో: అడ్డం రాకు.

రామం—అడ్డం రాను గాని....నేను రిఫరీని....ఆగండి, 1, 2, 3 అంటాను. (అని బల్లమీద వున్న బాటిల్ వాషర్ తీసుకుని మధ్యలో చెయ్యెత్తి పట్టుకుంటాడు. "ఒకటి—రెండూ—మూడు" అంటాడు. కూర్మారావు Bottle washer ని చూచి వణుకుతూ నుంచుంటాడు.)

నర—రా! రావేం మరి—శాండోవి.

కూర్మా—వస్తా! వస్తాగాని....అదీ....అదీ....అదీ....

నర—ఏమిటది?

కూర్మా—ఆ బ్రష్ తియ్యండి.

రామం—ఏం! ఈ బ్రష్కేం! (అంటూ కూర్మారావు దగ్గరకి బ్రష్తో వెళ్తాడు—"బాబోయ్!" అని కేకవేసి కూర్మారావు రెండోవైపు గదిలోకి పరుగెత్తుతాడు. నరశింహం వెంట పడ్తాడు, లోపల కేకలు. నరసింహం కూర్మారావును బయటకు లాక్కొస్తాడు, కూర్మారావు వంటినిండా బూజు వుంటుంది.)

నర—లోపలికెళ్ళి దాక్కుంటావేం? ఖలేజా లేదూ?

కూర్మా—ఖలేజా లేకేం! ఆబ్రష్తీసి అవతల పారెయ్యమను—చెప్తా నీపని.

రామం—ఆ. పారేశాలే కానివ్వండి. (అంటూ బ్రష్ టేబులు మీద పెడ్తాడు)

కూర్మా—అమ్మయ్య—యిహనా సీసంగతి తేలుస్తా (కూర్మారావు కుర్చీపట్టుకానికి మీదమీదకు వెళ్తాడు. నరసింహం వణుకు తాడు)

నర—బూజు బూజు

రామం—ఆ గదిలో బూజు అంటింది కాబోలు.

కూర్మా—ఆ! అక్కడే—అంటింది. అంటితే—? ఏమిటి—?

నర—ఛీ ఛీ—తీసెయ్యి.... తీసెయ్యి.

రామం—ఆ వెధవబూజు ఏం చేస్తుందయ్యా! (అంటూ బూజు చేత్తో తీసిచూపిస్తూ నరసింహం దగ్గరకెళతాడు. నరసింహం భయంతో బయటకు పరుగెత్తుతాడు. వెనకనే కూర్మారావు — పరుగెత్తుతాడు)

రామం—ఇదేమిట్రా! వాడికి బూజంటే భయం—

రంగ—ఈవస్తాదుకి "వాటిర్ బ్రష్" అంటే భయం

రామం—(బయటకుచూసి) వస్తున్నార్రా—

రంగ—బాగావస్తున్నార్రా! అంబోతుల్లాగా, ఇంతలావు వస్తాదులకి దాన్నిచూస్తే భయం. వెధవ బ్రష్—పాడైన బ్రష్ను చూస్తే భయమెందుకో?

రామం—నీకు లేదూ మిసాంసుచూస్తే భయం. అలాగే వాళ్ళకిని. వెధవ Brush (అంటూ బ్రష్ను కిటికీలోంచి బయటకు విసిరివేస్తాడు)

రంగ—అరే! మళ్లీ వాడిమీద పారేశావేం—(వస్తాదులిద్దరూ లోపలకు పరుగెత్తుకు వస్తారు.)

నర—పారిపోతావేం సిగ్గులేకుండా?

కూర్మా—అక్కడ ! బ్రష్ !!
నర—వుంటే ఏం, రా బయటికి పోదాం.
కూర్మా—నే రాను,—ఇక్కడే కుస్తీ పడదాం—రా (రంగనాథం బయటకు పోయి బ్రష్షు తెస్తాడు)
నర—బయటకు రా విశాలంగా వుంటుంది.
కూర్మా—అక్కడ కాదు యిక్కడే.
నర—పోనీ—యిక్కడే కానుకో.
రంగ—దీన్ని చూస్తే నీకు భయమెందుకయ్యా. పట్టుకు చూడు. ఏం భయం ఉండదు. చూడూ. (Brush తో కూర్మారావు మీదకు పోతాడు. కూర్మారావు "ఛీ ఛీ" అంటూ రెండవ ప్రక్క గదిలోకి పరుగెత్తుతాడు. నరశింహం వెంటపడి గుమ్మం దగ్గర ఆగి,—)
నర—ఆ చీకట్లో ఏం దెబ్బలాడతాం బయటికిరా ఖలేజా వుంటే.
కూర్మా—(లోపల్నించే) లోపలికి రా ఖలేజా చూపిస్తా. (రామం అక్కడపడివున్న బూజు తీసుకుని నరశింహం దగ్గరకొచ్చి)
రామం—దీంట్లో ఏముందయ్యా! ఉత్తబూజు యిటుచూడు— (నరశింహం బూజునుచూసి "బూజు బూజు" అంటూ లోపలికి పరుగెత్తుతాడు.)
రామం—అరే! కలియబడి కొట్టుకుంటున్నారే!
రంగ—ఊ—బాగా!
[బయట ఏవో కేకలు వినిపిస్తాయి. రామం రంగనాథం అటు వెళతారు. "ఇదేనా యిల్లు? వున్నారాలోపల? అనికేకలేస్తూ,

[ఓ ముసలాయన గబగబా వస్తుంటాడు]

రంగ—ఎవరో వస్తున్నార్రా!

రామం—ఎవరో కొత్తాయన, ఈయనెవరో!

[ఓ ముసలాయన గబగబా కోపంగా వస్తాడు.]

ముస—మీరేనా యీ గదిలో వుండి? మీరేనా అంటా? మీరేనా మా అమ్మాయికి ఉత్తరం రాసింది?

రంగ—మేం.... మేం.... మేం....కాదు.

ముస—కాదంటావేం! రంగనాథం అంటే ఎవరు—మీ యిద్దర్లో?

రామం—వాడే-వాడు.

రంగ—కాదండీ కాదు. నేను రంగనాథాన్నికాదు.

రామం—కాదంటావేంరా! నువ్వేగా రంగనాథం అంటే?

రంగ—రంగనాథం అంటే నేనే, కాని; కాని....ఆ....ఆ మీసాలు....

రామం—అదా-మీరు కొంచెం దూరంగావుండి మాట్లాడండి! మా వాడికి పెద్దమీసాలు చూస్తే కొంచెం భయం.

ముస—మీసాలు చూస్తే వణికి పోయేవాడివేనా! అంత ఉత్తరం వ్రాశావ్, నీ సంగతంతా మా అమ్మాయి చెప్పిందిలే! రోజూ ఈ వీధినే తిరుగుతావటగా! రోజూ మిర్రి మిర్రి చూస్తా వటగా! పెద్ద ధైర్యస్థుడివి బయలు దేరావ్. ఇక ఎప్పుడన్నా యిల్లా చేశావా?! ముక్కు పిండేస్తాను. జాగ్రత్త.

(బయట ఘోషణంగారూ ఘోషణంగారు వచ్చారండీ అని కేకలు వినిపిస్తాయి)

ముస—ఎవరది? నా పేరుపెట్టి పిలుస్తున్నారు

రామం—ఎవరోగాని గొంతు మా బాబాయి గొంతులాగవుంది. నేనా గదిలోకి పోతాను. నేను యిక్కడ లేనని చెప్పరా.

[రామం గదిలోకి గబగబా వెళతాడు. ఇంతలో ముసలాయన బయటకు చూసి]

ముస—ఇదేమిటి! వీ దొస్తున్నాడూ? వీడిక్కడికెందుకు వస్తున్నాడూ!!

రంగ—ఎవరు వాడూ?

ముస—వాడే!

రంగ—ఎవరు వాడూ!

ముస—వాడే! నా కప్పిచ్చినవాడు. ఇక్కడికెందుకు వస్తున్నాడో?

రంగ—ఆ మీకు.... అప్పిచ్చినవాడా?

ముస—ఆ! వసూలుచేయటానికి వచ్చాడుకాబోలు. కంటపడితే వదలడు. నే నిక్కడ వున్నానని వాడికెవరు చెప్పారో! ఈగది మీదేనా! దీంట్లోదాక్కుంటా కాసేపు. లేనని చెప్పండి అడిగితే.

రంగ—చెప్తా-మీరు తొందరగాపొండి.

[లోపలగదిలోకి ముసలాయన వెళతాడు. బయటనించి అప్పిచ్చినాయన వస్తాడు.]

అప్పి—ఇక్కడికి భూషణంగారు వచ్చారండీ?

రంగ—భూషణంగా రెవరూ?

అప్పి—అదే! ఈవీధిలో చివరవున్న యిల్లు— వాళ్లమ్మాయి చెప్పింది లెండి—యిక్కడున్నాడని. ఏరీ— ఎక్కడదాక్కున్నాడూ?

రంగ—ఏదీ! యిక్కడికి రాలేదే!

అప్పి—దబాయించకండి. నాలుగురోజుల్నించీ తప్పించుకు తిరుగు తున్నాడు. ఇవ్వాళ యమలోకానికిపోయినా వదలను—ఏమైనా సరే—చెప్తారా! ఎక్కడికిపోయాడో చెప్తారా! లేకపోతే—నేనే,

(లోపలగదిలో గోలవినిపిస్తుంది.)

అప్పి—ఏమిటాగోల?

రంగ—లోపలకొట్లాట జరుగు తోంది.

అప్పి—కొట్లాట ఏమిటీ! ఈయనాఅక్కడే వున్నాడా?

[రామం గదిలోంచి తిరిగి వస్తాడు.]

రామం—ఈయనెవర్రా! గొంతువిని బాబాయి అనుకున్నాను!

రంగ—ఆ ముసలాయనకి అప్పిచ్చినాయనలే! ఈ యిన్ని చూసి ఆయన గదిలో దూరాడు.

రామం—అరే!

అప్పి—దూర్తాడు—దూర్తాడు—ఎంత సేపు దాక్కుంటాడోచూస్తాగా—ఇక్కడే కూర్చుని. రానివ్వండి. అంతుతేల్చుకుంటా.

రామం—(తెరలోకిచూసి) అదెవరూ! ఇంకెవరో వస్తున్నారు.

రంగ—ఎవరో పోలీసు వస్తున్నాడు. ఎందుకో!

అప్పి—పోలీసా! ఎందుకొస్తున్నాడూ?

రంగ—ఏమో!

అప్పి—(భయంతో) నేను— — నేను— — ఆగదిలోకి వెళతాను.

రంగ—ఏం?

•

అప్పి—ఏం, లే. తర్వాత చెప్తాగా.

రంగ—మీరేమన్నా నేరంచేశారా !

అప్పి—నేరంగామా—పాడూకాదు ! నాకసలు ఆ ఎర్రటోపీచూస్తేనే వణుకు—వస్తా—వాడెందుకొచ్చాడో కనుక్కొని పంపెయ్యండి తొందరగా. వస్తా—

[అప్పిచ్చినవాడు గబగబా లోపలికి పరుగెత్తుతాడు. బయట నించి పోలీసు వస్తాడు.]

రంగ—రండి రండి.

పోలీ—ఎవరండీ ? యిక్కడ ఎవరో దెబ్బలాడుకుంటున్నారట ?

రంగ—దెబ్బలాటా ! !

పోలీ—దెబ్బలాట, ఖూనీలు, ఆరోడ్డువెంట పోతుంటే అమ్మాయి ఎవరో కేకేసిచెప్పింది.

[ముసలాయన— అప్పిచ్చినవాడూ బయటకు వస్తారు]

ముస—పోతేఫో ! ఏంచేసు కుంటావో చేసుకో.

అప్పి—ఏంచేస్తానా ? మూడు కోర్టులూ తిప్పిస్తాను. ఒదిలిపెడతా ననుకున్నావేం ?

ముస—అసలు నేన్నీకు బాకీయేలేదు. ఫో—ఎవడితో చెప్పుకుం టావో ! చెప్పుకో.

అప్పి—బాకీయేలేమా ? ఇల్లారా ఈలోపలికొచ్చి చెప్పు యీమాట.

(లోపలికితను దోవదీస్తాడు పోలీసునుచూశి భయంతో)

ముస—అక్కడికెందుకూ ! అక్కడ వాళ్ళు కొట్టుకుంటుంటే.

పోలీ—కొట్టుకుంటున్నారా ! ఎక్కడా ?

ముస—ఆ అదిగో ! ఆలోపల.

పోలీ—ఏరీ (గదిలోకి వెళ్లబోతాడు)

అప్పి—కొట్టు కుంటున్నారు— కాని నేను గాదు నేను కొట్లాటలో లేను. నేనుగట్టిగా మాట్లాడుతున్నాను. అంతే : ఏమయ్యా ! నే నిన్నుకొట్టానా ? నిజంచెప్పు (అంటూ ఘూషణాన్ని ప్రతి మాలబోతాడు.)

ముస—ఆ. కొట్టలేదూ యిందాక ఆగదిలో.

రంగ—లోపలికి వెళ్లండి—తొందరగా ! అరగంటనించీ వాళ్లిద్దరూ కొట్టుకుంటున్నారు.

పోలీ—ఆగండిగోల—ఏరీ ? ఎవరూ కొట్టుకుంటున్నది ?

(అని రెండోగదిలోకి వెళ్లబోయి గబగబా వెనక్కు పరుగెత్తుకొస్తాడు)

రామం—
రంగ—
ముస—
} ఏం— ఏం ఏం జరిగింది ?

పోలీ—చీకటి—గదంతా చీకటిగా వుందేమిటీ !

రంగ—ఆ ! చీకట్లోనే వాళ్ళిద్దరూ దెబ్బలాడుకుంటున్నారు తొందరగాపోయి విడదీయండి.

పోలీ—ఎల్లా ఆ చీకట్లో....?

రామం—చీకట్లోవాళ్ళు దెబ్బలాడు కోంగాలేనిది మీరు విడదియ్యటానికేం ?

పోలీ—అమ్మో ! చీకట్లో భయం వెయ్యదూ !

ముస—ఆగండి; నే వెళ్లి ఒదిలిస్తాను.
అప్పి—ఆ, పద నీతోపాటు నేవస్తా.
ముస—నువ్వెందుకూ—నువ్విక్కడవుండు.
అప్పి—అహా ! యిక్కడ పోలీసు— పద....
రంగ—మీరెవ్వరూ అక్కర్లే, ఆగండి, నేనువాళ్ళిద్దర్నీ బయటకు తరుముతాను.

(అంటూ బ్రష్ పట్టుకుని లోపలికెళతాడు. అందరూ బయట కొస్తారని వేచివుంటారు. ఎవరూరారు)

రామం—ఇంకా ఎవ్వరూరారేం— ఈపాటికి రావాల్సిందేనే!
పోలీ—ఏమిటిదంతా? ఏమీ అర్థంకావటంలే.
రామం—ఆవస్తాముల్లో ఒకడికి ఆబ్రష్ చూస్తేభయం.
పోలీ—బ్రష్ చూస్తేనా ! బ్రష్‌చూస్తే భయమెందుకూ ?

(ముసలాయన నిమ్మదిగా తప్పించుకు పో బోతాడు.)

అప్పి—ఆగుఆగు ఎక్కడికిపారిపోదామని.
రామం—మీరూ పోయి విడిపించరాదూ.
పోలీ—అమ్మో చీకటి ఎల్లా ?

[రంగనాథం తిరిగి వస్తాడు]

రంగ—లాభంలేదురా ! వాళ్ళిద్దరూ నావంకన్నా చూడటంలేదు వకటే దెబ్బలాట.
అప్పి—ఆ పోలీసును వెళ్లమనండీ— యిక్కడించీ, మీవల్లేం అవుతుంది.
రంగ—ఒరేయ్ ! ఆబ్యాట్రీ లైటు యిట్లా ఇవ్వరా.

పోలీ—ఆ! ఆపని చెయ్యండి— చీకటిపోతుంది. నేనూవస్తా.

రంగ—ఎవ్వరూ అక్కర్లే. ఈ బ్రష్ కనబడితేనే వాళ్లే వస్తారు. ఇది యిందాక ఆయనకికనిపించలే.

(ర్యామం లైటుతేగా రంగనాథం లోపలికితీసుకు వెళతాడు)

[వెంటనే కూర్మారావు—వెనక రంగనాథం పరుగెత్తుకు వస్తారు]

కూర్మా—వెధవని చంపేసేవాణ్ణి. మీరెందుకు లైటు తెచ్చారూ లోపలికి.

[నరశింహం వస్తాడు.]

కూర్మా—రా, రా— చంపేస్తా! రా!

నర—చంపుతావ్. నీ చేత అయ్యేపనే.

కుర్మా—చూద్దాగాని; రా!

నర—చూస్తా—ఆబూజుదులుపు.

కూర్మా—బూజుంటే—ఏం? రా

రంగ—బూజున్నా ఏం లేదు, బ్రష్ వున్నా ఏంలేదు.

[అంటూ బ్రష్‌తో ముందుకి వస్తాడు]

కుర్మా—ఛీ— ఛీ— బ్రష్ (అంటూ బయటకు పారిపోతాడు)

నర—పారిపోతావేం—! బ్రష్ చూస్తేభయమెందుకూ? బూజుచూస్తే భయంగాని

(వెంట పరుగెత్తుతాడు)

పోలీ—బూజుచూస్తే భయమెందుకూ? చీకటి చూస్తే భయంగాని.

(నవ్వుతూ వెంటవెళతాడు)

అప్పి—చీకటినిచూస్తే భయమెందుకూ—పోలీసుల్ని, చూశినాలేనిది? పదవయ్యా యింటికి.

ముస—నేనెందుకూ ? నే రాను. నాకు పనుంది. మా అమ్మాయి వుత్తరం రాశిన వాళ్ళెవరో కనుక్కోవాలి నువ్వుపో.

అప్పి—సరేకానియ్యి నేనూ యిక్కడే వుంటా! ఆపోలీసుని అవతలకిపోనీ—నీపనిచెప్తాను. (వెళతాడు)

ముస—పోలీసుల్నిచూస్తే భయమెందుకో ? (రంగసాధంతో) ఏమయ్యా యిప్పుడు చెప్పండి—ఎవరుపుత్తరం వ్రాశింది!

రంగ—అంతామావాడు చెప్తాడు గానీ—మీరు వీడితో—వెళ్లండి అవతలకి.

ముస—ఏం? మీకు నా మీసాలు చూస్తే భయం కాబోలు (నవ్వి) ఇంతకూ ఏమిటి బాబూ యీగోలంతా ?

రామం—ఏంలేదు. వెళ్ళి అంతా మీ అమ్మాయినడగండి; చెప్తుంది వరసగా వకరిమీదకు వకర్ని పంపించి.

ముస—అవును—దానికేం వచ్చిందో పోయేకాలం— ఇందర్నీ యిక్కడికి తరిమింది.

రామం—మీ అమ్మాయికి పెళ్లి భయం. వచ్చింది. ఇందర్కీ ఉత్తరాలు స్వయంగా వ్రాశింది. అందరికీ చెప్పి యిక్కడికి పంపించి. ముందు వెళ్లి మీ అమ్మాయినికనుక్కోండి.

ముస—వెళ్తా—అతను వెళ్ళాడాలేదా! ఒక్కసారిచూడండి.

(రామం బయటకు చూసి)

రామం—వెళ్లాడు.

ముస—అయితే యిక భయంలేదు— వెధవ- పోలీసులంటేభయం- మళ్లా! పట్టుకుంటే వదలను, వస్తా (వెళతాడు)

రంగ—ఖబుర్లు చెప్తున్నాడు— మళ్ళా యీయనకి అప్పిచ్చినవాణ్ణి చూస్తేభయం. అప్పిచ్చినవాణ్ణిచూస్తే భయం ఎందుకో! మీసాలన్నా లేవువాడికి.

రామం—నీకుమీసాలు చూస్తే భయమెందుకో.

రంగ—ఏడిశావ్‌లేరా! నీకు మీ బాబాయిని చూస్తే భయంలేదూ.

రామం—నకనే ఒక్కొక్కడికి ఒక్కొక్క భయం ఏభయమున్నా ఫర్వాలేదుగాని- సరిగ్గావిను- జీవితమంటే భయం లేకపోతే ఫర్వాలేదు. బ్రతకలేమే అని భయపడితే వాడు చచ్చినవాడితో సమానమే.

రంగ—బాగాచెప్పావ్- ఆ అమ్మాయి బాగానే చేసింది కాదూ- అందర్నీ ఆడించింది- ఏ భయం లేకుండా.

రామం—ఆ! అందరికీ బుద్ధి చెప్పింది. అందరూ వెళ్ళారు— ఇహ ఎవ్వరూ ఇక్కడికి రారులే. నిర్భయంగా వుండవచ్చు.

రంగ—ఆ బుద్ధివచ్చింది. (లెంపలువేసుకుని) మళ్ళా ఇలా పొరపాటు ఉత్తరాలు రాయనన్నాళ్లా ఏంభయంలేదు.



# అనార్కలి

( చరిత్రాత్మక నాటిక )

# పాత్రలు

సలీం:— రా కుమారుడు.

అక్బర్:— చక్రవర్తి.

అబుల్ ఫజుల్:— మహామంత్రి.

తాన్ సేన్:— ఆస్థానగాయకుడు.

మాన్‌సింగ్:— సేనాపతి.

సేవకుడు:—

అనార్కలి } తాన్ సేన్ శిక్షణరక్షణలలో ఉన్న 12, 13 ఏళ్ళ
చాంద్ } బాలికలు.

# అనార్కలి

(యువరాజు సలీం రాజభవనపు పరిసరాల్లో ఉద్యానవనం దూరాన ఒక ప్రక్క అంతఃపురం—రెండవప్రక్క [illegible] సంగీతకళాశాల కన్పిస్తుంటాయి.)

ఉద్యానవన మంతటా గులాబీ మొక్కలు విరగపూచి కన్నుల పండువగా కన్పిస్తుంటాయి. మధ్యలో ఒక్క అనార్ (దానిమ్మ) మొక్క ఎఱ్ఱని పుష్పాలతో కళ్లను చెదరగొడ్తూం ఉంటుంది.

అంతలో ఇద్దరు ముసిలిమ్ సుందరాంగులు భయపడుతూ ప్రవేశిస్తారు. వనసౌందర్యం చూసి ముగ్ధులవుతారు. ఒకరిని చూసి వకరు సంతృప్తితో, చిరునవ్వులు నవ్వుకుంటారు. ఒకసుందరి (అనార్కలీ) మొక్కదగ్గరకు వెళ్లి చూస్తూ నుంచుంటుంది.

చాంద్—మందమైన ఈ పహ్లావీ సౌగంధం సమీరంకంటె భారమై వీచికలతో వీచిపోలేక వనంలోనే వుండి పోతున్నట్లుంది. మెహర్! ఈ సౌగంధానికి నా హృదయం మదమెక్కి పోతూంది.

అనార్—అయితే యికనేం పద మంజీరాలతో లయ కూర్చుతూ నాట్యం చెయ్యి. నేను పాట పాడుతాను.

చాంద్—అమ్మో! పహరావాళ్ల కన్నుగప్పి ఈ పహ్లావీవనంలో ప్రవేశించాం. పాట వింటే పట్టుకు [illegible]మెయ్యరూ! కన్నుల

నోములు పండి వనసౌందర్యాన్ని మాత్రం తిలకించగలిగాం.
ఇక చాలు. పదపోదాం.

అనార్—ఫరవాలేదులే.

చాంద్—కాదు మెహార్! ఉస్తాద్ తాన్‌సేన్‌జీ సంగీతమందిరానికి వెంపేసే వేళకూడా కావస్తున్నది. పద యికపోదాం.

అనార్—ఈవేళ మరింతవ్యవధి వుందిలే! ఇంత వరకూ సంగీత శాలలోసందడే లేదు.

చాంద్—(వనమంతా వక్కసారి చూసి) వనమంతా పచ్చావీ గులాబీ పువ్వు కన్నెల నవ్వులే గాని కన్ను చెదరి పొయ్యే టట్లు ఈ "అనార్" ఎక్కడనుంచి వచ్చిపడిందో!

అనార్—ఏమో! కాని, లేగులాబుల మధ్య అరుణాతిశంతో అనార్ కూడ అందా లెగజిమ్ముతూంది కదూ!

చాంద్—ఏవో చెదరివచ్చిపడిన తెగువరి, దీన్నెప్పుడో మూలంతో కూడా పెరికి దూరంగా పారేస్తారు.

అనార్—మహారాజులు! (నిష్ఠురంగా అంటుంది)

చాంద్—ఏరీ? వస్తున్నారా?

అనార్—రావటం కాదు. వారి ఆగ్రహ అనుగ్రహాలు గ్రహచారాన్నే మార్చి వేస్తాయి కదా!

చాంద్—మార్చివేస్తాయి. కనకనే పద. ఉండరానిచోట వుంటే, పడరాని బాధ పడవల్సి వస్తుంది.

అనార్—నువ్వెప్పుడన్నా చక్రవర్తిగార్ని వీక్షించావా?

చాంద్—లేదు. ఏదీ! నేను పట్టణాని కొచ్చి ఇంకా ఆరు నెలలు పూర్తికాలేదు. ఇంకా దర్బారు మొగసాలకూడా ఎట్లా వుంటుందో చూడలేదు. నువ్వు చూశావా ?

అనార్—లేదు. నేనొచ్చి పది రోజులేగా. ఉస్తాద్ తాన్‌సేన్‌జీ ఆజ్ఞ తిరస్కరించలేక ఇవ్వాళవరకూ గడపన్నా దాటి రాలేదు.

చాంద్—అందుకనే ఇంత ధైర్యంగా వున్నావు. వారి ఆజ్ఞ తిరస్కరిస్తే ఏమౌతుందో ఎరుగున్నావా ?

అనార్—ఎరుగుదును. కానీ ఇంత సౌందర్యం యిక్కడగూడు కట్టుకునివుంటేగా చూస్తూ దూరాన ఎట్లా ఆగగలను. రోజూ ఆ మేడమీద నుంచి చూస్తుంటే ఈరోజా పువ్వులు చిరుగాలికి అల్లల్లాడుతూ చేతితో పిల్చినట్లనిపించేది. కాని గడప దాటి రావటానికి భయం వేశేది.

చాంద్—ఇక పద పోదాం. సలీం రాకుమారునిచూస్తే యింత అందంలోనూ భయం వేస్తుందిట.

అనార్—ఇంత అందంలోనూ భయమా ?

చాంద్—ఆ! నాతో ఎప్పుడూ సంగీత శాలకు వచ్చే "కుతుబ్" చెప్పింది.

అనార్—ఏమని చెప్పింది ?

చాంద్—షహజాదావారి 'కన్ను" బండి చక్రమంత వుంటుందట.

అనార్—ఆ !!

చాంద్—హస్తం వస్తాదులు కసరత్ చేసే బండలాగుంటుందట. పాదం ఏనుగు పాదమట.

అనార్—ఆ!

చాంద్—మొహమంతా మన రెండు కళ్ళతో వక్కసారిగా చూడలేమట. వారి మీసమే సముద్రపు మీనమంతలావు పొడుగులట.

అనార్—అబ్బా!

చాంద్—ఒకసారి ఆ తీక్ష్ణ దృక్కుల్లోపడి సంషిద్ మూర్ఛపోయిందట.

అనార్—నిజంగా!

చాంద్—నవ్వితే సింహం గర్జించినట్లుంటుందట. ఇంక కోపం వస్తే....

అనార్—(గాభరాపడి) చెప్పకు.

చాంద్—చెప్పనులే.

అనార్—ఇక పోదాం పద. ఉస్తాద్‌జీ వచ్చే వేళకూడ అవుతుంది.

చాంద్—ఆగు. ఎవరో యిటు వస్తున్నారు.

అనార్—ఆ!

చాంద్—ఇక్కడ దాక్కుందాం—రా. వారటు వెళ్ళినతరువాత ఇటు పారిపోవచ్చు.

[ఇద్దరూ వెళ్ళి అనార్ మొక్క వెనుక దాక్కుంటారు. అక్బర్, అబుల్ ఫజల్ వస్తారు]

అక్బ—సలీం ఇంతగా పట్టు పడతాడని నే నెప్పుడూ అనుకోలేదు. ఇప్పటికీ తనకు నచ్చిన కన్నెనేగాని మనం చూపించిన కన్నెను చూడటానికే ఒప్పటంలేదు. ఏం చేయగలం.

అబుల్—యౌవనంలో అలాంటి ఆలోచన లందరికీ వుంటాయి. మన సుతనికి ఇంకా నచ్చచెప్పాలి.

అక్బ—ఇంకా ఎన్ని విధాలుగా నచ్చచెప్పగలం, సౌందర్యం—కళ—ఆరాధనా అంటూ మనం ఎప్పుడూ అనేకబుర్లే తనూ ఏకరువు పెడుతూ వున్నాడు. మిమ్మల్ని చూసి కొంతవరకు ఈ వేళ చెలరేగలేదు. తాను వివాహమాడబోయే కన్నె సౌందర్యంలో ప్రపంచాన్ని జయించాలంటాడు. ఏమిటో! సృష్టి సౌందర్యాన్ని సరిచూచి విలువగట్టటం ఎవరికి సాధ్యం. సృష్టిలో గల సౌందర్యాన్నిచూసి సంతోషించటం వరకే వంతు. "అది యెక్కువ ఇది తక్కువ" అని నిర్ణయించటానికి మనమెవరం?

అబుల్—అవును. సృష్టి స్థితిలయాల్లో వంతు పంచుకున్న మన మెంత? "ఇది అందమైనది, యిది కాదు" అని నిర్ణయ మెక్కడ? కంటికి కనుపించే ఆకర్షణనుబట్టి నిర్ణయించగలం గానీ ఏ వర్ణసముదాయంలో ఏ సారస్యముందో మన మెక్కడ నిర్ణయించగలం?

అక్బ—చూడండి. ఈ అనార్ మొక్క గులాబీల మధ్య ఎంత గుబురుగా పెరిగిందో! ఇది యిక్కడ ఎందుకు నాటారో గాని గులాబీలవల్ల దీనికి, దీనివల్ల గులాబీలకు అందం యినుమడిస్తున్నది. ఈ మిశ్ర వర్ణ సౌందర్యాన్ని ఏ చిత్రకారుడూహించగలడు? (ఇద్దరూ అనార్ దగ్గరకువెళ్ళి నుంచుంటారు.) ఒట్టి దానిమ్మ మొక్క కింత అందంవుందని నే నెప్పుడూ వూహించలేదు. ఎంతటి సుందరాంగి ఈసుకుమారి! ఎంతటి అమాయకురాలీ కుసుమాంగి.

(అనార్, చాంద్ నెమ్మదిగా భయపడ్తూ లేచి నుంచుటారు. అక్బర్, ఫజుల్ తెల్లబోయి మొఖాలు చూచుకుంటారు.

చాం—నా అంతట నే నిక్కడకు రాలేదు వనమాలీ! చూసివద్దమని ఈ పిల్ల నన్నిక్కడకు లాక్కువచ్చింది.

ఫజుల్—ఏవరమ్మాయిలు మీరు? ఎవరితో మాట్లాడుతున్నా మనకుంటున్నారు?

అక్బ—మాట్లాడ నివ్వండి. ఈ ప్రకృతి అంతటికీ అల్లాయే ఒక వనమాలి. మనమెంత వారం. ఎందుకొచ్చారమ్మాయీ యిక్కడికి?

చాంద్—చూసి పోదామని వజీర్ సాహబ్! చూడండీ మా చేతిలో ఒక్క పువ్వూ కూడా లేదు. ఇక్కడెక్కడన్నా విరిగిన కొమ్మ వున్నదేమో మీరే చూడండి,

అక్బర్—నీ పేరేమిటి?

చాంద్—నా పేరు చాంద్. మిమ్మల్ని బ్రతిమాలుకుంటాను వజీర్ సాహెబ్! మమ్మల్ని రాజ భటులకు వప్పచెప్పకండి.

అక్బర్—నీ పేరు? (అని అనార్కలీని అడుగుతాడు.)

అనార్—నా పేరు....నా పేరు....నా పేరు (వణికి పోతుంది.)

(అగ్బర్, ఫజుల్ ఆ భయాన్ని చూసి నవ్వుతారు)

అక్బర్—ఏమిటమ్మాయీ నీ పేరు?

అనార్—నా పేరు మె....మె....మె....మెహార్ కాదు-మె....మె....మె....

అక్బర్—(నవ్వి) నీ పేరు నే చెప్తానమ్మా. నీ పేరు "అనార్కలీ!"

ఫజుల్—చక్రవర్తిగారి నెప్పుడన్నా చూశావా అమ్మాయీ?
అనార్—చూడలేదు.
చాంద్—చూడలేదు గాని విన్నాం.
అగ్బర్—విన్నారా! ఏం విన్నారు?
చాంద్—చాలా విన్నాం, అమ్మో! తల్చుకుంటేనే భయంవేస్తుంది.
అగ్బర్—భయ మెందుకూ?
చాంద్—అమ్మో-భయం కాదూ! ఆ కోపంతో నిండిన కళ్ళు, పులి ఆవలించి నట్లు నవ్వు, సొరచేపంత మీసాలూ....

(అగ్బర్, ఫజుల్ నవ్వుతారు)

చాంద్—నవ్వుతారేం అబద్ధమనుకుంటున్నారా! కావలిస్తే మా మా కుతుబ్ నడగండి.
అగ్బర్—కుతుబ్ ఎవరూ?
చాంద్—కుతుబ్ నెరుగరూ? చూడబోతే చక్రవర్తిగారి మొహం గూడా చూడ లేదు లాగుందే! చక్రవర్తిగారి దగ్గర ఆస్థాన గాయకులు లేరూ-తాన్‌సేన్‌గారూ?
అగ్బర్—ఆ! ఆ!
చాంద్—ఆయన పాట పాడుతుంటే పక్కన తబలావాయించడూ అమీర్?
అగ్బర్—ఆ!
చాంద్—ఆ తబలావాయించే ఆయన బావమరిది లేడూ?
అగ్బర్—అహా! ఆ అమ్మాయి ఏం మాట్లాడదేం?
చాంద్—ఆ అమ్మాయి ఎప్పుడూ అంతే; మగ వాళ్ళెవరన్నా వుంటే ఏం మాట్లాడదు. ఎవరూ లేకపోతే తెగ మాట్లాడు తుంది.

అబుల్—నువ్వో, మగ వాళ్ళుంటే తెగ మాట్లాడుతావా?!

చాంద్—నేనా? ఛా! మగవాళ్ళుంటే ఎందుకు మాట్లాడుతానూ? ముసలి వాళ్ళుంటే ఎక్కువ మాట్లాడుతాను.

అబుల్—కానీ ఇది షహజాదా సలీమ్‌గారి ఉద్యానవనం. వా రెవరన్నా చూస్తే కోప్పడతారు, వెళ్ళండి.

చాంద్—ఆ సంగతి మాకు తెల్సు. వారిని చూస్తే అందరికి భయమే కానీ యిక్కడ మీరున్నారుగా.

అబుల్—మేముంటే ఏం?

చాంద్—ఏముందీ? ముందు పెద్ద వాళ్ళను మిమ్మల్నే కోప్పడతారు. మీరు తిట్లుతిని వెళ్తుంటే మీ కాళ్ళ వెనకే మేమూ వచ్చి బయట పడతాం.

అబుల్—కాని యువరాజు సలీమ్ చూస్తే మిమ్మల్ని వూరికే వదిలెయ్యడు. అతనికి చిన్న పిల్లలంటే కోపం. అందులో అందమైన పిల్లలంటే మరీని.

చాంద్—ఎందుకూ?

అబుల్—తోటలోజేరి గోల చేస్తారనీ, గులాబీ పువ్వులు తుంచి విరజిమ్ముతారనీ....

చాంద్—మరి గులాబీ పువ్వులు తుంచి తలలో పెట్టుకోక, వాడిన తర్వాత-గడ్డాలలో పెట్టుకుంటారా ఏమిటి?

అబుల్—కోకిలకు పిచ్చెక్కినట్లు నువ్వింత మాట్లాడుతున్నావు. నీ స్నేహితురాలు ఏం మాట్లాడ దేం?

చాంద్—రక్షక భటుడిలాగా మీరిన్ని ప్రశ్న లడుగుతున్నారు. (అక్బర్‌ను చూపిస్తూ) సారాయి సేవించిన వారిలాగా ఈయన మెదలకుండా చూస్తూ నుంచుంటాడేం ?

అబుల్—అమ్మాయీ వా రెవరో తెలుసా ?

అగ్బర్—ఊరుకోండి వజీర్‌సాహెబ్. చంటిపిల్లలకు అగ్నిభయం ఏం తెలుస్తుంది ?

అబుల్—ఇక మనం బయలుదేరితే బాగుంటుందేమో.

అగ్బర్—అలాగే ! అల్లరి చెయ్యకుండా చూసి వెళ్ళి పొండి. అమ్మాయిలూ; యువరాజు సలీమ్‌చూసి నట్లయితే వూరికే వదిలి పెట్టడు.

(వెళ్ళుతారు)

అనార్—ఏమిటీ ! ఆ కొత్తవారితో గూడా పెంకిమాటలు ?

చాంద్—కొత్తవారైతే భయమా ఏమిటి! అంతగా అయితే ఆసలీం రాకుమారుణ్ణే అడుగుతాను.

అనార్—ఏమని :

చాంద్—"ఏం జహాపనా !" మీరు ఘడియ ఘడియకు ఓ కొత్త గులాబి నుత్తరించి హుక్కాగొట్టంలాగా ఎల్లప్పుడూ చేతిలో వుంచుకొని ముక్కులో కుక్కుకుంటారే ? చిన్నచిన్న ఆడపిల్లలం, జడలోముడుచుకుంటే తప్పా" అని.

అనార్—అరరే ! అటు చూడు ఎవరో యిటు వస్తున్నట్లున్నారు.

చాంద్—ఎవరో దర్బారు నాటకాల్లో నటకుడై వుంటాడు.

అనార్—ఆ కళ్ళు చూడు. మనస్సునేదో కోసుకు తినేట్లున్నాయి.

చాంద్—యువరాజు వేషానికి బాగా పనికి వస్తాడు.

అనార్—అట్లా బిత్తర చూపులు చూస్తున్నా దేమిటి నా కోసం వెతుకు తున్నట్లు!

చాంద్—పద దాక్కుందాం. నటకుల్ని నమ్మరాదంటాడు మా అసీఫ్.

అనార్—అబ్బ! కదల బుద్ధవటం లేదు. వెళ్ళి ఆ విశాల వక్షం మీద వాలిపోవాలని లేదూనీకూ!

చాంద్—అదేంబుద్ధి! విదలించి కొట్టితే!

అనార్—ఆ పాదాల కిందపడి ప్రాణాలొదలొచ్చుగా.

చాంద్—వస్తున్నాడు. దాక్కుందాం-రా (వెళ్ళి దాకుంటుంది. అనార్కలీ కదలలేక, అట్లాగే చూస్తూ నిలబడ్తుంది. యువరాజు సలీం ఏదో వెతుక్కుంటూ వస్తాడు. అనార్కలీని చూడకుండా వెతుకుతుంటాడు. అనార్కలీ అతనివంకే చూస్తూ రెండడుగులు ముందుకు వేస్తుంది-అప్రయత్నంగా)

సలీం—మా పావుర మొకటి యిటు పారిపోయి వచ్చింది. కన్పించిందా?

అనార్—(మాట్లాడదు)

సలీం—నిన్నే అడిగేది. మా పావుర మొకటి తప్పించుకొని....
(అనార్కలీ వంకచూసి) ఎవరు నువ్వు?

అనార్—(మాట్లాడదు)

సలీం—నిన్నె! ఎవరు నువ్వు?

అనార్—...............

సలీం—(వింతగా ఆమె దగ్గరకు వెళ్ళి పరీక్షగా చూస్తూ)
ఆహ్హాహ్హా ! ఎక్కడనుంచి తప్పించుకొని వచ్చావ్ ?
అనార్—మీ మందిరంలోనుండి కాదు.
సలీం—అయితే నా మనోరంగం నుండా ?

(చాంద్ ధైర్యంచేసి బయటకువచ్చి ఇద్దర్నీ చూస్తూ నిల్చుంటుంది)

అనార్—మీ మనోరంగంలో నే నెప్పుడూ లేనే !
సలీం—నువ్వెప్పుడూ అక్కడే వున్నావు.
చాంద్—లేదు. నటమహాశయా. మా అక్క అక్కడ కెప్పుడూ వెళ్ళలేదు. మీ మనోరంగమో ! నాటకరంగమో ! అక్కడ నుండి పారిపోయి రానూలేదు.
సలీం—కాదు, అక్కడనుండే రెక్కలు గట్టుకు పారిపోయింది. పట్టుకొని రెక్కలు కట్టివేశి అక్కడే వుంచుకొంటాను.
చాంద్—వద్దువద్దు స్వామీ ! మే మిక్కడకు యిక ఎప్పుడూ రాబోము.
సలీం—ఈ గులాబీ రేకుల్లాంటి చెక్కిళ్ళు నా కళ్ళమీద నొక్కుకుంటాను.
చాంద్—ఆ !
సలీం—మందహాసాల మధువులు చిందుతూన్న లేే పెదవుల కాంతిని ఎదపై పులుము కుంటాను.
చాంద్—ఈ దివాణంలో వున్నవారందరికీ యిదే జబ్బా ఏమిటి ?
సలీం—నువ్వెవరు ఏదో మాట్లాడు తున్నావు ?

చాంద్—నువ్వెంత నటుడివి! నన్నింతవరకూ చూడనట్లే మాట్లాడు తున్నావు? ఇకపోదాం పద మెహర్! ఈయనేదో రక్కుతాను, గిల్లుతాను అంటున్నాడు. ఆయువరాజు సలీం కనిపిస్తే "తన్నేస్తాను. తాగేస్తాను" అంటాడట.

సలీం—ఎవరూ అనేది?

చాంద్—షహజాదా సలీం వారిని నువ్వూ ఎరుగవూ? ఎప్పుడూ గులాబీ పువ్వులుతుంచి పోస్తూ దర్బారుకు వెళ్ళుతూవుంటాట్టే!

సలీం—ఆయనా! ఆయన్ని ఎప్పుడన్నా చూశావా!

చాంద్—చూశావా! అమ్మయ్యో! ఆయనకంట బడితే ఇంకే మన్నా వుందా! ఆయన కంటబడి మా షంషీద్ మూర్ఛ పోయిందట! సామాన్యమా! బండిచక్ర మంత కన్ను.

సలీం—ఎవరి కన్ను?

చాంద్—షహజాదా సలీం వారిదే. చక్రవర్తిగారి కన్ను గున్న ఏనుగంత కూడా వుంటుందేమో.

సలీం—ఎవరు చెప్పారు నీ కివన్నీ?

చాంద్—కుతుబ్ చెప్పింది, రాత్రి నిద్రపోక ముందు యివన్నీ వింటే భయంవేశి అసలు నిద్రరాదు.

సలీం—కానీ వారు నిన్నుచూస్తే ఏమీ అనరులే.

చాంద్—ఎందు కనరూ? అందులో చిన్నపిల్లలిని చూస్తే ఆయనకు మరీ కోపమట.

సలీం—అదెవరన్నారు?

చాంద్—ఇందాక యిటు రాలే యిద్దరూ? అందులో ముగ్గపండిన గడ్డమాయన లేడూ, ఆయన పక్కనే వున్నాడే గడ్డం లేని,

ఆయన-ఆయన అన్నాడు.

సలీం—అటిల్ మహాశయులునూ నాన్నగారూనా! (కోపంగా అటు చూస్తాడు)

చాంద్—ఏ మహాశయులో! యువరాజు గారంటే హడల్ పుట్టించాడు. ఏం పాడు బుద్ధో యువరాజావారిది! పెద్దవాళ్ళనూ ముసలి వాళ్ళను, వదిలేసి చిన్న చిన్న పిల్లల ప్రాణాలు కొరుక్కుతింటాడట.

సలీం—కాదు. ఆయన మంచివాడు. మిమ్మల్నేమీ అనడులే.

చాంద్—ఎందు కనడూ? మేమింకా చిన్నపిల్లలమేగా?

సలీం—అవును. చిన్న పిల్లలు. అందువల్లనే మల్లెమొగ్గలవలె మిమ్మల్ని శిరస్సు మీద వుంచుకుంటాడు.

చాంద్—శిరస్సు మీద వుంచుకోకపోతే మానె: సమాధి చేయించకుండా వుంటే చాలు.

సలీం—ఏమన్నావూ?

చాంద్—ఏమన్నానూ?

సలీం—చూడు. నీ స్నేహితురాల్ని మహారాణిని చేస్తాను.

చాంద్—మహారాణినా....!!

సలీం—ఆఁ....భావి భారత పట్ట మహిషిని చేస్తాను.

చాంద్—ఎందుకూ! ఈ తోటలో నుంచి దండించకుండా బయటకు పంపించండి. చాలు.

సలీం—ఎవరా దండించేది? మిమ్మల్నెవరన్నా దండించవస్తే, "షహజాదా సలీం అనుజ్ఞ" అయిందని చెప్పండి.

చాంద్—షహజాదా సలీమా!!!

సలీం—కాదంటే కంఠం నులి మేస్తానని చెప్పండి.

చాంద్—ఆఁ!

సలీం—రోజూ ఈ వేళకు యిక్కడికి రండి.

చాంద్—అంత ధైర్యం కలవాడివైతే మమ్మల్నా మొదటి పహరా దాటించి వెళ్ళరాదూ?

సలీం—(నవ్వి) నే నెవర్ననుకున్నావు?

చాంద్—ఏమో-ఎవరివో గాని, నీ కోపం చూస్తుంటే మాత్రం నటుడివిగా కనబడటం లేదు.

సలీం—నటుణ్నికాదు. కానీ నటించక తప్పటంలేదు. ఈఅమ్మాయి పేరేమిటన్నావూ?

చాంద్—అసలేమో ఏదో పేరు, అసలు పేరామెకే తెలియదు. ఉస్తాదు తాన్ సేన్‌జీ పెట్టిన పేరు 'మెహర్.' ఇప్పుడొచ్చి నాయన పెట్టిన పేరు "అనార్కలీ."

సలీం—అనార్కలీ బానిసల చిహ్నం. అనార్కలీ! నువ్వు అనార్కలీవే! మొగల్ ఉద్యానవనంలో లేని స్థానాన్ని సంపాదించుకొన్నావు. అనార్కలీ! నువ్వు నిజంగా నా అనార్కలీవే. నీ కోసమే. నేను చూస్తున్నాను. నీవు దొరికావు. నా కోక సాధనం దొరికింది. ఇక పోరాట మారంభమవుతుంది. మీ రెక్కడకూ వెళ్ళనక్కరలేదు. నేటి నుండీ మా అంతరంగిక గృహంలోనే మీ నివాసం. పదండి లోపలికి.

చాంద్—లోపలికా? అమ్మో! పహరావాళ్ళు చూస్తే?

సలీం—ఏం జేస్తారు? ఈ సలీం మాట కాదనటానికా చక్రవర్తికే శక్తి చాలదు-పదండి.

చాంద్—సలీం! అయితేమీరు....సలీమా?

సలీం—అవును.

చాంద్—అమ్మో! (పరుగెత్తుతుంది.)

సలీం—(బిగ్గరగా నవ్వుతాడు) నువ్వు మాట్లాడవేం? నీకు నేనంటే భయం లేదూ.

అనార్—(అతని వంక చూస్తూ వుంటుంది.)

సలీం—మాట్లాడవేం. నీ స్నేహితురాలు పారిపోయింది.

అనార్—(మాట్లాడదు)

సలీం—మాట్లాడకుండా చూస్తావేం. నన్నూ, నా బండి చక్రాల్లాంటి నా కళ్ళనూ చూస్తుంటే భయం వెయ్యటం లేదూ?

అనార్—మీ కళ్ళు బండి చక్రాల్లాగా లేవు.

సలీం—ఆ! మరి ఎట్లాగున్నాయి?

అనార్—నన్ను నిలువునా మాడ్చివేయటానికి భగభగమండుతూ, మింటి నంటుతూన్న మంటల్లాగున్నాయి.

సలీం—ఓ! అదీ భయంకరమేగా.

అనార్—భయంగానే వుంది. పారిపోవాలనీ వుంది. కాని ఏదో-నా కాళ్ళను కదలనివ్వకుండా వుంది. నా మనస్సు నేదో-కట్టివేశి ముందుకు లాగుతోంది.

సలీం—నాకు తెల్సు-నీవు నన్ను ప్రేమిస్తున్నావ్ కదూ!

అనార్—ఏమో? ఏమంటానికీ నావశం కావటం లేదు. ప్రాణాలు అరణ మివ్వటానికి ఏదో అనటమెందుకు.

సలీం—ఎంత పిచ్చి పిల్లవు! (చేతుల్లోకి తీసుకొని) నాతోరా. నిన్ను అంతరిక్షాని కెత్తివేస్తాను. స్వర్లోక సింహాసనంమీద నిన్నధివసింప జేస్తాను. భారత రాజన్య దివ్యచరిత్రాల్లో నీ నామం సువర్ణాక్షరాలతో చిత్రంగా చిత్రిస్తాను.

అనార్—వద్దు. నన్నీ తోటలో ఈ మూలనే వుండ నివ్వండి. ఎల్లప్పుడూ మీ రుండే దివ్యభవనం వంక రెప్పలార్పక చూస్తూనుంచుంటాను.

సలీం—ఇక్కడ ఈ పల్లావిల విరవీగు చూస్తే మొహం మొత్తుతోంది. నీ కిక్కడ కన్నా సలీం రాకుమారుని హృదయ సింహాసనమే ఉచితమైనది. రా! వెళ్దాం.

(అమ్మో! అమ్మో! అంటూ చాంద్ పరిగెత్తుకు వస్తుంది.)

సలీం—ఏమిటది ?

చాంద్—పహరావాడు! పహరావాడు వెంట బడ్డాడు. తరుముకు వస్తున్నాడు. పగపట్టిన పాములాగ విచ్చుకత్తి నెత్తి విసరి వేశాడు. వచ్చి పడుతున్నాడు.

(రెండోవైపుకి పారిపోతుంది-పహరావాడు ప్రవేశించి సమస్కరిస్తాడు.)

సలీం—ఏమిటిరా ఈ గోల!

పహరా—ఎవరో బానిస బాలిక-షహజాదా! మా కళ్ళుగప్పి పల్లావీవనంలో ప్రవేశించింది. (అనార్కలీని చూచి) ఇదెవరు? నువ్వూ ఆ పిల్లతోనే వచ్చావా?

సలీం—వన్ను దగ్గరుంచుకు మాట్లాడు. భావిభారత సామ్రాజ్ఞి ఈ బాలిక !

పహారా—ఈ బానిసా ?

సలీం—ఏ మన్నావ్ ?

పహారా—ఈ బానిసను ఉస్తాద్ తాన్ సేన్ జీ మహాగాయకుని నర్తన శాలలో చూచాను షహజాదా ?

సలీం—నీ ప్రాణాలమీద ఆశవదలి వచ్చావన్రా ? (కత్తి దూస్తాడు)

పహారా—క్షమించండి ! షహజాదా ! క్షమించండి ! సెలవు తీసుకుంటాను. క్షమించండి. (వెళతాడు)

సలీం—(అనార్ తో) అయితే ఉస్తాద్ తాన్ సేన్ దగ్గర నువ్వు నాట్యం నేర్చుకుంటున్నావా ?

అనార్—అవును.

సలీం—దర్బారులో ఎప్పుడన్నా నాట్యం చేశావా ?

అనార్—లేదు.

సలీం—పోనీ యిప్పుడు నాట్యం చేస్తావా ?

అనార్—ఏమిటో ! మిమ్మల్ని చూస్తూ నుంచుంటేనే నా పాదాలు అలిసి పోయినట్లు తేలిపోతున్నాయి. చేయలేను. క్షమించండి. మీ కత్తి దూయకండి, దూసి మీ బానిసలాగా నన్ను బెదిరించకండి. నేను చిన్నకీటకాన్నైపోయి మీ పాదాలపైన వున్న గులాబీలాంటి గోళ్ళతో ఆడుకోవాలనీ వుంది. ఆ పాదాల కిందపడి నలిగిపోవాలని వుంది. నన్నుదయించి నాట్యం చెయ్యించకండి. మీ దివ్య సుందర విగ్రహాన్ని చూసి చూసి అలసిపోయాను. రవంత సేపు అలసట తీర్చుకో నివ్వండి.

సలీం—అలాగే ఇటురా. ఈ పాలరాతి వేదికమీద, నా వడిలో తలవుంచి విశ్రమింతువుగాని....(తీసుకువెళ్ళి తొడమీద తలతో పండుకొన బెడ్తాడు.)

(దూరాన గానం వినవస్తుంది)

అనార్—ఏమిటా దూరన ఏదో రాగాలాపన.... చిరుగజ్జెల రవళీ వినవస్తున్నాయి.

సలీం—ఉస్తాద్ తాన్ సేన్ జీ నర్తనశాలలో సాయం సమయ సంగీతాభ్యాసం కాబోలు.

అనార్—కాదు. రాగరంజిత మయూరం ఆకాశంలో మందంగా చిరు చిందులు తొక్కుతోంది కాబోలు.

సలీం—ఉస్తాథ్ తాన్ సేన్ జీ మహాశయుని మధురగానం మందానిలం మీద తేలి వస్తోంది.

అనార్—కాదు ఏదో దివ్యమైన అశరీరవాణి నిర్మలాంతఃకరణతో నన్ను మందలించి తొందరగా రమ్మంటోంది.

సలీం—లేదు. తాన్ సేన్ గాన మందిరంలో నుండి సుకుమారమైన సప్తస్వరాలు సన్నజాజుల లతల్లాగా సాగి వచ్చి వినవస్తున్నాయి.

అనార్—సాగి వచ్చి, నా మనో మందిరా న్నాలింగనం చేసుకొని, బలీయమై పోయి, నాగుండెల్ని గుంజుకు పోతున్నాయి. నే నవశనై పోతున్నాను. నాకు నిద్ర వస్తోంది.

(సన్నగా విన వస్తున్నగానం యిప్పుడు బాగా వినవస్తోంది)

సలీం—(నవ్వి) నిదురించావా! నిదురలో కూడా అమాయకత్వాన్నే నీ వదన సరోజం వెదజల్లుతోంది! అనార్కలీ వదనా రవింద మధు పాయినై మత్తిలి పోయిన నా కిప్పుడు ఆ సేతు హిమాంచలాల వరకూ విస్తరిల్లి సామ్రాజ్య మొక లెక్కగా కనుపించటం లేదు;

[మాన్‌సింగ్ ప్రవేస్తాడు]

మాన్—షహజాదా సలీం రాకుమారునకు మాన్‌సింగ్ ప్రణామాం నర్పిస్తున్నాడు.

సలీం—మహారాజా వారేదో సత్వరమైన పని మీద వచ్చి నట్లున్నారూ!

మాన్—సత్వరమైన పనేమీ లేదు షహజాదా! తమరొనవ్యాతి నవ్యమైన పదవి నలంకరించి నట్లున్నారు.

సలీం—అవును. ఇదీ వక పదవే కదా!

మాన్—షహజాదా వారితో నేను మాట్లాడవల్సిన రాజకార్య మొకటుంది. కొలది కాలం వ్యవధి కోరుతున్నాను.

సలీ—ఇది సాయం సమయం, వ్యాహ్యాళి కాలం. రాజకార్యాలు ఉదయమే విన్నవించుకొన వచ్చును

మాన్—షహజాదా వారు బాధ్యత గుర్తించి ప్రవర్తించుట లేదు.

సలీం—షహజాదాకు ఆ అవసరమూలేదు.

మాన్—షహజాదా భావి భారత సార్వభౌముని అంకశయ్యపై బానిసకు స్థాన మిస్తున్నారు. చర్యగాని ఈ సమాధానము గాని రాజన్య లోకాలరంజింప జాలదు.

సలీం—అంతా విమర్శించుకునే మాట్లాడుతున్నాను.

మాన్—మీరు మాటలాడటం లేదు. నన్ను వమాన పరుచుతూ వున్నారు.

సలీం—మీ రక్తే చంపోయివచ్చును.

మాన్—షహజాదా ?

సలీం—షహజాదాను ధిక్కరించు అధికారం మీ కెవ్వ రిచ్చారు.

మాన్—తన అకృత్యాంతో షహజాదాయే పదవీ భ్రష్టు డవుతూ వున్నాడు.

సలీం—పదవీ భ్రష్టుణ్ణయినందుకు నేను పరితపించను.

మాన్—పదవీ భ్రష్టుం కుపదేశించే బాధ్యతా నాకు లేదు భావి భారతానికే నేను బాధ్యుడనై మాట్లాడుతూవున్నాను షహజాదా! చిన్నతనపు చలిపిలనం మరచిపోలేకనో, యౌవ్వన ప్రాదుర్భావపు వుద్రేకంచేతనో, తమరు తప్పటడుగులు వేస్తూ వున్నారు. భారతదేశానికి మీ వంశపు బాధ్యత ఒకటున్నది. పరస్పరద్వేషపూరితమైన రెండు మతాల సామరస్యము మనము సాధించవల్సివుంది అందువల్లనే, చక్రవర్తి హైందవ సంబంధం చేసుకొన్నారు. అందువల్లనే తోటివారిలో తల వంపులైనా నేనున్నా యీ సేవాధర్మానికి తలవొగ్గి, నా సహోదరులపై కత్తిగట్టి మీ తండ్రిగారి సేవచేస్తున్నాను. మా జన్మలో మా లక్ష్యంకోసం మేము యింతవరకూ పాటు పడ్తూన్నాం. ఇప్పుడు మీరు మాతో కలసిరాకపోతే, తలపెట్టిన మహాకార్యం తుదముట్టదు. నేను ఐక్యభారత స్వేచ్ఛా

స్వాతంత్ర్యాలపేరిట హిందూమహమ్మదీయ సభ్యత పేరిట, మీరున్నూ మీ తండ్రిగారి అడుగుజాడల్లో నడచి హిందూ సుందరిని పెళ్ళాడి ఆదర్శ ప్రభువులుగా భారతాన్ని పాలించ మని అడుగుతూవున్నాను.

సలీం—కాని నన్నేం త్యాగం చేయమంటున్నారో ఆలోచించటం లేదు.

మాన్—మేమందరం చేస్తూవున్న త్యాగాన్నే మిమ్మల్నీ చేయమని కోరుతూవున్నాను.

సలీం—అంత త్యాగశీలతకు నేను నోచుకోనలేదని మనవి చేస్తున్నాను.

మాన్—ఇదే మీ అంతిమ నిర్ణయమా!

సలీం—అంతిమ నిర్ణయ మీ వరకే జరిగిపోయినది, నాయనగారితో మొన్నటినుండే మనవి చేసుకుంటూవున్నాను, వివాహం నా ఆంతరంగిక సమస్య-రాజకీయాలతో దీన్ని ముడిపెట్టకండి.

మాన్—రాజుకు రాజకీయా లొక్కటేగాని వేరుగా ఆంతరంగిక సమస్యలుండకూడదు, ఆంతరంగిక సమస్యలు వేరేమీ వుండ టానికి వీలూలేదు.

సలీం—అరాచరికం నాకక్కరలేదు.

మాన్—మొగలాయీ సామ్రాజ్య స్థాపకుని ఆశయమూ మీ కక్కర్లేదా.

సలీం—అక్కర్లేదు.

మాన్—ఇది దేశ ద్రోహం అవుతుంది.

సలీం—రెండవది ఆత్మ ద్రోహం.

మాన్—మీ మూర్ఖంలో మమ్మల్నికూడా తిరస్కరిస్తూన్నారు.

సలీం—మిమ్మల్నే కాదు; సర్వరాజ్య తంత్రాన్నీ తిరస్కరించటానికి సిద్ధమై యున్నాను. ఈ బాలికను పెళ్ళాడబోతున్నాను.

మాన్—ఈ-బానిసనా ?

సలీం—ఆ-ఈ బానిసనే.

మాన్—నే నింతవరకూ భారత సామ్రాట్టుకు సేవకుడను. ఇక బానిస సామ్రాట్టుకు సేవకుణ్ణి కాలేను. ఇదే నా అంతిమ నిర్ణయం.

(వెళ్ళును. తాన్ సేన్ సంగీతం ఆగింది)

అనార్—ప్రభూ........ప్రభూ........ప్రభూ.

సలీం—నిద్రాభంగమైనదా !

అనార్—ఏదో దుస్వప్నము ప్రభూ !

సలీం—స్వప్నమా ?

అనార్—ఆ ! స్వప్నము ! నేను పడగనెత్తిన పామునై ఆడుతూ వున్నానట. మీరు నన్నాడిస్తూ ఏడిపిస్తున్నారట. అంతలో ఒక కఠినాత్ముడు వెనకనుండి బలమంతా ఉపయోగించి భూమి యంతటిభారంగలగదతో మీ మస్తకన్యస్తమణిమయకిరీటం మీద మోదాడట ఆ కిరీటం నా మీదపడి నన్ను భూమిలోని కణగ ద్రొక్కిందట.

సలీం—నా మీదపడి నన్ను అణగదొక్కుతుంది లే అనార్ లే. నా భవనం లోపలికి వెళ్దాం పద.

అనార్క—వద్దు-ప్ర-ఘా-వద్దు-రవ్వంత సేపిక్కడే, యీ అనార్ మొక్క చెంతనే వుండి తృప్తిపడ నివ్వండి.

సలీం—అదేమిటి! త్వరితగమనంతో తాన్ సేన్ గురువర్యులు ఇటే వస్తున్నారు. ఎందుకో!

అనార్—గురువర్యులా!

(లేచి నుంచుంటుంది తాన్ సేన్, చాంద్ వస్తారు)

తాన్—షహజాదా వారికి నా అభివందనాలు.

సలీం—మహాశయుల ఆగమనం మాకెంతో ఆనందంగావుంది.

తాన్—ధన్యుణ్ణి, షహజాదా! బాలిక విషయమై వ్యాకులుణ్ణై ఇటు స్వయంగా వచ్చాను. అమాయకపు బాలిక అపరాధం చేసింది. క్షమించి విడిచిపుచ్చండి.

సలీం—బాలిక దేం అపరాధంలేదు. దీనిలో అపరాధిని నేను.

తాన్—చాంద్ చెప్పింది; అనుజ్ఞ లేకుండా అంతఃపురోద్యాన వనంలో ప్రవేశించిందట; మీరు బంధించారట,

సలీం—అవును, పఫ్లావీలను తస్కరించిందికూడా.

తాన్—ప్రథమ తప్పిదాన్ని క్షమించమని సవినయంగా విన్నవించు కుంటున్నాను.

సలీం—గురువర్యులు క్షమించాలి; ఈమె చేసిన తప్పు అంతకంటే ఎక్కువదే. ఈమె అపహరించిన పఫ్లావీ మొగలాయీ రాజ చిహ్నం. రాజచిహ్నాన్ని ఎదిరించి నా ప్రేమను దోచుకుంది.

తాన్—ఈ అమాయకపు బాలికను మీరు వరించారా?

సలీం—అవును.

తాన్—సృష్టి సకారణమంటారు. ఈ విషయంలో ఆ వాక్యం నిజమేనా అనుపిస్తుంది. భూలోకంలో రతీమన్మథుల్ని విధాత వూహించే కల్పించాడనుకుంటాను. ప్రభూ! మీ దాంపత్యంలో ఎవరు ఎవరి కలంకారమో ఆ విధాత గూడ నిర్ణయించ లేడను కుంటాను.

సలీం—(నవ్వి) కాని మా దాంపత్యమీ వూహల్లోనే నివసిస్తుంది గురువర్యా! మా జీవితాలనే వస్తూవీ బలిగోరుతుంది.

తాన్—ప్రభువుల మనోగత భావం అర్థమగుటలేదు.

సలీం—వీ రిద్దరినీ ముందు నర్తన శాలకు పంపించండి. మాట్లాడుదాం.

(తాన్ సేన్. చాంద్, అనార్ లవంక చూడ, చాంద్ అనార్ లు వెళ్తారు)

సలీం—ఉస్తాద్ జీ! నేను నా రాచరికం నిలబెట్టుకొనటాన్కి ప్రేమించిన పెళ్ళి చేసికొనరాదంట-రాచకీయపు ఎత్తుగా వారు కట్టిన బండను మెడకు తగిలించుకుని తిరగాలిట.

తాన్—సుకుమారమైన జీవితాన్ని బండను చేసుకోవటంకంటె రాచరికాన్నే వదులుకోవటం మంచిది.

[అబుల్ ఫజుల్ ప్రవేశిస్తాడు]

అబుల్—కళా తపస్వికి నా అభివందనాలు; కళారాధనే జీవిత లక్ష్యంగా గల షహజాదాకు, జోహార్లు.

సలీం—ఏ మిట్లా యేతెంచారు.

అబుల్—స్వరేమీలేదు, షహజాదా-కళామూర్తులు మీ రిద్దరూ. రాటకీయాల్లో పండిముగ్గిన యీ గడ్డపుతాతకు కూడ మీ సంభాషణలో తావు దొరుకుతుందనుకుంటాను.

తాన్—అందుకు సందేహ మేముంది.

అబుల్—సందేహం లేదు గనకనే నె నాలోచించాను-మహా గాయకా! స్వరాన్ననుసరించని కళామాధుర్యం మంచిదే నంటారా.

తాన్—మాధుర్యం ఎక్కడున్నా మంచిదే. స్వరం మనం కల్పించు కున్నదేగా.

అబుల్—అవును మనం కల్పించుకొనేను దానిని మనం మార్చు కొనగలమని రాకుమారు డంటా డనుకుంటాను. ఏమైనా పాతకాలపువాళ్ళం మేము; కళాకారుల భావాలంత వేగంగా మా భావాలు పరుగెత్తవు. అయినా చూడండి, ఈ పహ్లావీ వనాన్ని మా తాతగారి కాలంలో నాటారట, మొగలాయీ వంశీకు లందరికీ ఎంతో ప్రియమైనది. ఇంతవరకూ యీ పహ్లావీవనంలో మరోజాతి మొక్కకు స్థానం దొరక లేదు. ఆరు దశాబ్దాల నాతరంలో గూడ యీ పహ్లావీవనంలో పరాయి కొమ్మకు ప్రవేశ మివ్వలేదు. కాని యీ నాటికి యిక్కడ దొక్క అనార్ ఆవిర్భవించింది. ఆవిర్భవించి శోభ కూర్చిందంటారా? నాకంటికేమో అట్లా అనిపించటం లేదు.

తాన్—మంత్రివర్యులు బాహ్య సౌందర్యాన్నే మనసులో భావిస్తు న్నారులా వుంది. పహ్లావి విలువగల సుకాటీకన్నె. అనార్

కుసుమం వికసించేదైనా ఫలప్రదమైనది. అంతిమ ఫలాన్నే ఆశించి నట్లయితే గులాబీకంటే దానిమ్మలకే ఫలమెక్కువ.

అబుల్—అయితే అనార్‌ను గులాబీతో సరితూచ వచ్చునంటారా!

తాన్—మహామంత్రులు తాము వేదాంతులమని మరచిపోతున్నారు. అల్లా సృష్టిలో, ఎక్కువ తక్కువలు లెక్కలు కట్టటానికి మనమువెంతవారం? మన ఇష్టాఇష్టాల ననుసరించిననిర్ణయంలో ఏది ఎక్కువైనా ఏది తక్కువైనా—అల్లా దృష్టిలో సృష్టి అంతా సమానమేగదా!

అబుల్—అల్లా దృష్టి అనిర్వచనీయమైనది; గాయకమహాశయా ఎంత తేటతెల్లమైనదో, అంత తంటాలు పెట్టేదికూడ. సృష్టిలో తరతమ భేదాలు లేవు. లేకపోనూలేదు. అబుల్ ఫజుల్ తాన్‌సేన్ లాగా సంగీతమాధుర్యాన్ని విన్పించనూ లేడు. అబుల్ ఫజుల్ వలె తాన్‌సేన్ చతురోక్తులాడనూలేడు.

సలీం—కాని కుర్రవాడైనా యీ సలీం చతురోక్తు లాలకించగలడు సచివాగ్రణీ.

అబుల్—నే కాదనగలనా? షహజాదా; తమ మనోగతాభిప్రాయం తెల్సుకుందామనే, నేనూ తహతహలాడుతున్నాను.

సలీం—మీరు మహావేదాంతులు, రాజనీతి దురంధరులు. నాకంటే అన్ని విషయాల్లోనూ విశేషశేముషీ సంపన్నులు. కాని నా కన్ను ఎట్లా విషయాలను చూడగలదో మీ కన్నూ అట్లాగే చూడగలదు గదా.

అబుల్—కన్నులో భేదం లేదుగాని అనుభవాన్ని బట్టి గ్రహింపులో భేదం వుంటుందిగదా!

సలీం—మీ అనుభవమే తప్పెందుకు కాగూడదు.

అబుల్—కావచ్చు. నా అనుభవమే తప్పుకావచ్చు. కాని నావంటివా రనేకమంది, నాకంటే పెద్దలు, అనుభవించి సెలవిచ్చింది తప్పని అనటం సాహసంకదా; అందరి అనుభవాన్ని పురస్కరించుకుని, ముందుకు పోవటం అభివృద్ధిగాని, గుడ్డిగా ముందుకుపోతూ ఎప్పటికప్పుడు స్వానుభవమే అనుసరణీయమనటం అభివృద్ధి అవుతుందా!

సలీం—తమరు తార్కికులు. మీ తర్కవేదాంతాలు కొలదిసేపు మరచిపోండి. మేదస్సుతో కాదు. మనస్సుతో సెలవీయండి. నేను రాచవంశీకుణ్ణి. నా మనస్సుకు మీ మనస్సుకు భేదమేమన్నా వుంటుందంటారా!

అబుల్—లేదు.

సలీం—మీ అనుభవాన్ని పురస్కరించుకొని చెప్పండి. నాకంటికి అందమైనది మీకంటికి అందంగా కనుపించదా?

అబుల్—అందంగానే కన్పిస్తుంది.

సలీం—అందమయిన వస్తువునే అభిలషించటం నా ఒక్కడితర్కమే కాదుకదా; జీవితమంతా సౌఖ్యప్రదం చేసుకోవాలనేగదా ప్రతిమానవుడూ అభిలషించేది.

అబుల్—అవును.

సలీం—నాకంటికీ, నామనస్సుకీ నచ్చినదేకదా, నా జీవితాన్ని సౌఖ్య ప్రదం చేయగలిగింది. రాచపుట్టుక పుట్టినంతమాత్రాన నామనస్సు చంపుకోటం సాధ్యమా? మనస్సులేని, మమకారం

లేని, మగువను వివాహమాడితే నా జీవితం ఎలాగుంటుంది ? రాచపుట్టుక పుట్టినంతమాత్రాన జీవిత సౌకుమార్యాలనే వదిలి వేసి సౌందర్యాభిలాషనే వదిలివేసి, మనస్సుకున్న మాధు ర్యాన్నే మరచిపోవాలంటారా ?

అబుల్—కవిగా అబుల్‌ఫజుల్‌గా నే నెప్పుడూ నా సలీం పక్షమే. కాని రాజకీయజ్ఞునిగా. సామ్రాజ్యానికి మంత్రిగా మొగలాయీ వంశ శ్రేయోభిలాషిగా నేను షహజాదాతో అంగీకరించ లేక పోతున్నాను.

సలీం—అబుల్-దాదా నన్ను మీ చేతుల్లో పెంచారు. ఆ చిన్ని సలీంగానే పెరగనివ్వండి, షహజాదాగా నన్ను చూడొద్దు.

అబుల్—షహజాదా ! కర్కశ మనస్కుడైన అబుల్‌ఫజుల్ మాత్రమే యిప్పుడు జీవించివున్నాడు.

సలీం—అరచేతుల్లో నన్ను పెంచారు. అంతా మర్చిపోయ్యారా ? నాయనా !

అబుల్—సలీం ! నామనస్సు కరిగించే ప్రయత్నం చాలించు. నేను నిన్ను పెంచాను. ఈ సామ్రాజ్యాన్నీ పెంచాను. శతాబ్దాలు గడచినా, హిందూమహమ్మదీయులు, విరోధాన్ని మరచిపో లేకపోతున్నారు. ప్రభుత్వా లొస్తున్నాయి-పోతున్నాయి. ఎన్ని ప్రభుత్వాలు మారినా విరోధాలే పెరుగుతున్నాయి. ఇప్పుడు సర్వమత సమైక్యం సాధించాలని ప్రయత్నిస్తున్నాం. మొగ లాయీవంశం యీ సమైక్యతకు పూనుకున్నది. మొగలాయి చక్రవర్తుల దుస్తులే మతసామరస్యాన్ని సూచించే పద్ధతిని

మార్చివేశాం. మొగలాయీ వంశ ర క్తమే హిందూ మహమ్మ దీయ ర క్తసమ్మేళనంగా మార్చాలని సంకల్పించాం.

సలీం—అక్కరలేదు. మీ సామరస్యంతో నాకు పనిలేదు. మీ సామ్రాజ్యం నా కక్కరలేదు. నేను మామూలు సరదారుగా, మామూలు పౌరునిగా బ్రతకనివ్వండి చాలు. మీరు నాదుస్తుల మార్చగలరు, నా రక్తాన్ని మార్చగలరు, నా అభిలాషను మార్చలేరు. ఈ హిందూ మహమ్మదీయ సమ్మేళనం మీ రను కున్నట్లు జరగగలదని నమ్మక మేమిటి? అమృతం పుట్టిన చోటనే హాలాహలం పుట్టవచ్చు. నా జీవితాన్ని అసౌఖ్యంలో, అసంతృప్తిలో ముంచి, నా కడుపున అమృతం పుట్టుతుందని ఆశిస్తున్నారు. కాని దీనికి ఫలితంగా హాలాహలం పుట్టి మీ ఆశయాన్నీ, మీ సమైక్యతను మీ మొగలాయీ వంశాన్నే చిన్నాభిన్నం చేస్తుందేమో ఆలోచించండి.

అబుల్—దానికి భగవంతుడే వున్నాడు.

సలీం—ఇదే నిశ్చయమా!

అబుల్—అదే నిశ్చయం.

సలీం—అయితే నా నిశ్చయం వినండి.

అబుల్—నాకు చెప్పనక్కరలేదు షహజాదా! భావిభారతమే నీ చర్యను చర్చిస్తుంది గాయక మహాశయా! నాకు శెలవిప్పిం చండి. (వెళతాడు)

తాన్ సేన్—షహజాదావారుసన్నుక్షమించాలి. మీరుమాట్లాడినదంతా రాజకీయపు చిక్కుగా కనిపిస్తూంది గాని యీ చిన్న మొక్క సంగతి కాదల్లేవుంది.

సలీం—అవును మహాశయా. అంతా రాజకీయమే. వారి రాజకీయాలకై నేను వలచిన సుందరిని గాక వేరెవతెనో పెండ్లాడమంట రెండు రోజులనుంచి నన్ను వేధిస్తూవున్నారు. దానికి నే నొల్లనని చెప్పివేశాను. అయినా నా మెడలు వంచటానికే ప్రయత్నిస్తున్నారు.

తాన్ సేన్—అయితే షహజాదావారు మా మెహర్‌ని ప్రేమించలేదా!

సలీం—ప్రేమించాను. సామ్రాజ్యాన్నె ఒదులు కుంటాను. కాని నా అనార్కలీని వదులుకోను.

తాన్ సేన్—మీ కంతటినిష్కళంకమైన ప్రేమవుంటే తాన్ సేన్ కంటే సంతోషించేవాడు; సహకరించేవాడూ లేడు కాని నిజం చెప్పండి. మీరు ప్రేమకై ప్రభుత్వాన్ని ధిక్కరిస్తున్నారా! ప్రభుత్వాన్ని ధిక్కరించటానికే ఆమెను ప్రేమిస్తున్నారా! (సలీం ఊరు కోవటం చూసి) ఆలోచిస్తున్నారా! యువరాజా! ఇంతవరకూ ఆలోచించకుండానే ప్రేమించారా!

సలీం—నామనస్సు సరిగాలేదు మహాశయా! అదంతా నన్నడిగి విసిగించకండి. సలీమో, సామ్రాజ్యమో యిప్పుడే తేలి పోవాలి-తేలిపోతుంది.

తాన్ సేన్—కాని అమాయకపు బాలిక అనార్కలీ జీవితం ఇప్పటికే తేలిపోయింది. షహజాదా! మీ రాజకీయపు రాపిడి అనార్కలీ ముగ్ధజీవితాన్నే దగ్ధం చేయబోతోంది. యువరాజు సలీం తన బలం తెల్సుకొనటానికై యీ బాలికను బలిపెడ్తున్నాడు. బలిపశువు బాధ ప్రభువుల కేంతెల్సు. సింహాసనం మీదనున్నా

చర్మాసనం మీద నున్నా రాజకుమారున కేం బాధ? బానిసకే బాధ. మీ క్రోధాలూ, పట్టుదలలూ తారతమ్యాలూ అన్నీకల్సి ఒక బానిసమీద కసి తీర్చుకుంటాయి. మహారాజు క్రోధానికీ- మీ ప్రేమకూ-నాకేమీ భేదం కన్పించటంలేదు నిజంగా మీకు అనార్కలీమీదే అనురాగం వుంటే, అనార్కలీ సౌందర్యానికి ముగ్ధులై తే, అనార్కలీని ప్రేమించానని అన-బోకండి. పెండ్లాడతా ననబోకండి. సౌందర్యంకోసం, కళకోసం, ప్రే మకోసం, ఆమెను ప్రేమించలేదనే అనండి. పెండ్లాడి ప్రాణాలు తీసే ప్రమేయం వదలి వెయ్యండి.

[చాంద్ పరుగెత్తుకు వస్తుంది]

చాంద్—ఉస్తాద్ జీ.............ఉస్తాద్ జీ....!

తాన్ సేన్—చాంద్ ! ఏమిటమ్మా ! ఏం జరిగింది.

చాంద్—మన మెహర్ ని రాజభటులు బంధించి తీసుకుపోయారు. ఉస్తాద్ జీ....

సలీం—<br>తాన్ సేన్— } ఆ :

చాంద్—సంగీత శాలలో స్మృతి తప్పి పడిపోయింది-మెహర్ ! మేము వుపచారాలు చేస్తున్నాం. రాజభటులువస్తే ఎందు కోసమో ననుకున్నాం. కాని మెహర్ ని సవ్వారీమీద తీసుకు పోయారు.

తాన్ సేన్—షహజాదా !

సలీం—భయం లేదు గాయక మహాశయా ! అనార్కలీ జీవితానికి నా జీవితాన్నే బలిపెట్టాను.

తాన్ సేన్—కాని బలిపెట్టి ఏమి సాధిస్తారు.

సలీం—అంతటినీ సాధిస్తాను. నా ప్రత్యర్థుల ఆశయాల్ని మంట గలుపుతాను. వారి ఆదర్శానికే అగ్గినంటిస్తాను. అవసరమైతే ప్రాణాల్నే బలిపెట్టి వారి ప్రాణాల్ని బలిగోర్తాను.

[అక్బర్ అబుల్ వస్తారు]

సలీం—(గంభీరంగా) అనార్కలీ ఎక్కడుంది !

అబుల్—భారతదేశ సర్వసహా చక్రవర్తి ఆజ్ఞోల్లంఘన చేసినవారు వుండవల్సిన చోటనే వుంది.

తాన్ సేన్—దయాగుణ కీర్తిశాలి అక్బర్‌చక్రవర్తి యినుప పాదాల కింద నలిగిపోతోంది.

సలీం—అనార్కలీ ఎక్కడుంది. (కత్తి దూస్తాడు)

అబుల్—రాజద్రోహు లుండవల్సిన చోటనే వుంది.

సలీం—ఎవరా రాజు ?

అక్బర్—నేను-సలీం—నేను సలీం—ఆకరవాలానికి శిరస్సే లక్ష్యం. నీహృదయక్షోభనంతటినీ పుంజుకున్న ఖడ్గంతో, యీ శిరస్సు నుత్తరించు.

సలీం—బాబా !

అక్బర్—నా పితామహుడు బేబర్ నాతండ్రి హుమాయూన్ వ్యాధి గ్రస్తుడై య్యుండగా-అల్లాను ప్రార్థించి- ఉపవసించి - అసువు లర్పించి పుత్రుని రక్షించారట. ఆ భాగ్యానికి నోచుకోని మందభాగ్యుణ్ణి (దుఃఖావేశంతో) నన్ను కృతార్థుణ్ణి చేయి సలీం.

అబుల్—జహాపనా !

అక్బర్—ఒక్క క్షణకాలం నాపుత్రుడితో మాట్లాడనీయవా మహా మంత్రీ.

సలీం—పుత్రుడుగా మాట్లాడనక్కర్లేదు జహాపనా ! అనార్కలీ కంటె అపరాధిని నేను. మీ శాసనాల ఆక్రోశం నావంకకు మరల్చండి, నాకు మరణశిక్ష విధించండి. నా అసువులు కూడ పోసుకుని సుఖించండి.

అక్బర్—మహామంత్రీ.

అబుల్—జహాపనా !

అక్బర్—ఆ-మరణ శిక్షాపత్రం మీద కూడ యీ చేతులే రాజ ముద్రవేయాలా !

అబుల్—జహాపనా ! మీరే యింత భీరువులైతే ఎట్లా ?

తాన్‌సేన్—అందరూ భీరువులే మహాశయా; ప్రపంచమంతా భీరువులే. నిరపరాధిని బలిగొనటం తప్ప వేరేందుకూ ధైర్యం లేనివారందరూ భీరువులే.

అబుల్—ఆగండి-గాయక మహాశయా ! దుఃఖంలో తొందరపడకండి.

తాన్‌సేన్—జహాపనా; మీకుమారుడుమీ మాట వినకపోతే ఆ బాలిక అపరాధమేముంది జహాపనా ! మీరు శాసనకర్తలు. కాని శాసనం చేసిన తర్వాత అందరకూ ఒకలాగే వర్తించాలి. ఆజ్ఞోల్లంఘనం చేసింది సలీం-కాని శిక్ష అనుభవించేది అనార్కలీ.

అక్బర్—కాదు గాయకమహాశయా ! ఆజ్ఞోల్లంఘనం చేసింది సలీం- శిక్ష అనుభవించేది, అనార్కలీ అక్బర్‌నా గూడా; ఏమి రాచరికం: ఏమి సార్వభౌమత్వం; తన కుమారుని సౌఖ్యానికి గూడ విచ్ఛిన్నం పుట్టించే చక్రవర్తిత్వం వుంటేనేం మండిపోతేనేం!

అబుల్—సార్వభౌములు దుఃఖావేశంలో కారణజన్ములన్న విషయం మరచిపోతున్నారు-సార్వభౌములకు ప్రజాసౌఖ్యంకన్నా వాంఛ నీయం లేదుగదా ! ప్రజలు గూడ తమ పుత్రసమానులే గదా. పుత్ర ప్రేమకోసం ప్రజలను నట్టేట ముంచుతారా !

అక్బర్—అబ్బా !

అబుల్—శతాబ్దాలుగా ఏ ఒక్క సార్వభౌమునకూ మీ పవిత్ర సంకల్పం స్ఫురించనైనా లేదు. ఎవరికైనా స్ఫురించినా హిందూ మహమ్మదీయులు కల్సిరావటం కష్టం. మానసింగ్ లాంటి హిందూ మహావీరులు మతాభిమానాన్ని వీడి, తమతో సహకరించటానికి అంగీకరించారు. మహమ్మదీయ మత ప్రవక్తలు కూడ మీ మీదే విశ్వాసం వుంచారు. మహాసము ద్రంలాంటి ఈ రెండు మతాల్ని సమ్మేళవించి, సుస్థిరసామ్రా జ్యాన్ని నెలకొల్పవల్సిన భారం మీమీద వుంది రెండు మతా లకూ సంబంధించిన ప్రభువంశం ప్రభవించే అవకాశం మీ కొక్కరికే యీ దేశంలో యిప్పటికి లభించింది.

అక్బర్—ఏమి సదవకాశం ! ఏమి చరిత్ర ! సరే. కానివ్వండి దేశసౌఖ్యం నాగర్భశోకా న్నభిలషిస్తే అల్లాగే కానివ్వండి.

సలీం—చక్రవర్తి ఫర్మానా యిదేనా ?

అక్బర్—చక్రవర్తి ఫర్మానా కాదు. నీ తండ్రి అభీష్టంకూడా యిదే.

సలీం—సరే కానివ్వండి; మీ ఫర్మానాలకూ అభీష్టాలకూ పైన అల్లా శాసనం ఒకటుంది. మంచికోసం తలపెట్టినా కృత్రిమం కృత్రిమమే. మీ శాసనాలతో మానసిక ప్రకృతినీ, ప్రకృతి శాసనాన్నీ ప్రతిఘటించ దల్చుకున్నారు. అసహజమైన యీ ప్రతిఘటనలలోనుండి అసహజమైన హాలాహలమే ఆవిర్భవిస్తుంది. ఈ సమయంలో రగుల్కొన్న అసంతృప్తి నా ఆజన్మాంతం నన్ను వేధించడమేకాదు; తదుపరి వంశీకుల్లో రగిలి రగిలి మాడ్చివేస్తుంది. మాడి పడివున్న బూడిదల చూసి గుండెలు బాదుకోవటానికి మీరు చిరకాలం జీవించండి. ఈ సలీంమాత్రం నేటినుండి చనిపోయినవాడే. (వెళ్ళిపోతాడు)

తాన్‌సేన్—ప్రభూ !

అక్బర్—గాయక మహాశయా........

తాన్‌సేన్—అనార్కలీని-ఏం చేస్తారు ప్రభూ.

అక్బర్—అనార్కలీ! దురదృష్ట దేవతావతారం! ఈ అనార్కలీ వృత్తాంతం అంతా యిక సమాధిచేసి వెయ్యండి. (గోడ్ని చూపిస్తూ) ఈ అనార్కలీని యిక్కడే-యిప్పుడే జీవ సమాధి చేసివెయ్యండి. (వెళ్తాడు)

తాన్‌సేన్—అనార్కలీ! అనార్కలీ....

అబుల్—ఇం కెక్కడి అనార్కలీ!

తాన్‌సేన్—ఏమంటారు వజీర్ సాహెబ్.

అబుల్—అనార్కలి వృత్తాంతమే యికలేదు. అనార్కలి సమాప్తై పోయింది.

తాన్‌సేన్—చక్రవర్తి అనుజ్ఞ ప్రకారమేనా!

అబుల్—మంత్రి సమూహము వర్గాల నిర్ణయ బద్ధంగా!

తాన్‌సేన్—అన్యాయం; అన్యాయం; వజీర్జీ ఇంత ఘోర నిర్ణయానికి మీ మనస్సెట్లా అంగీకరించింది. ఇంతటి పైశాచిక కృత్యానికి మీ విచక్షణా జ్ఞానం ఎట్లా తల వగ్గింది.

అబుల్—రాజకీయల్లో మన మనస్సుకీ మనసులోని దయాది సుకుమార భావాలకూ తావు లేదు గాయక మహాశయా!

తాన్‌సేన్—అనార్కలీ! అనార్కలీ! అన్యాయంగా ఆహుతై పోయావా. అనార్కలీ. (దుఃఖిస్తుండగా)

(తెర)

# పాత్రలు

1. Dr. సంజీవం : పల్లెపట్టులో ఉచితంగా వైద్యశాల నడుపుతున్న డాక్టరు 28 సం॥రాలు.
2. ప్రెశిడెంటు : ఆ ఊరి పంచాయతీబోర్డు ప్రెశిడెంటు. 45 సం॥రాలు.
3. హెడ్మాష్టరు : ఆ ఊరి హైస్కూలు హెడ్మాష్టరు. 52 సం॥రాలు.
4. చౌదరి : Dr. సంజీవానికి సహాయంచేస్తూ వైద్యశాలలో పనిచేస్తున్న యువకుడు. 22 సం॥రాలు.
5. జయరావు : సువర్ణ బాల్యస్నేహితుడు. 28 సం॥రాలు.
6. సువర్ణ : Dr. సంజీవం భార్య. 22 సం॥రాలు.

# పూర్వస్మృతులు

[Dr. సంజీవంగారి ఇంట్లో ముందుగది. సామాన్యమైన సోఫాసెట్టు. మధ్యలో ఓ చిన్న టీపాయి వుంటాయి.

తెరఎత్తేసరికి ఎవ్వరూ లేరు. తర్వాత Dr. సంజీవం భార్య సువర్ణ, ఆవూరి పంచాయతీబోర్డు ప్రెశిడెంటు, స్కూలు హెడ్మాష్టరు, మరో యువకుడు చౌదరి ప్రవేశిస్తారు. డాక్టరు సంజీవం, సువర్ణల చేతిలో పూలహారాలు వుంటాయి. చౌదరి చేతిలో రెండు వెండి కేస్కెట్లు, హెడ్మాష్టరు చేతిలో రెండు సన్మానపత్రా లుంటాయి. సంజీవం సువర్ణలు తప్ప తక్కినవారంతా చాలా సంతోషంగా వుంటారు]

హెడ్మా—సన్మానం దివ్యంగా అనుకున్నప్రకారం జరిగిపోయింది. ఏ వర్షం రాకముందే మంచి పనికి ఇల్లాగే దైవసహాయం గూడా లభిస్తుంది.

ప్రెశి—దైవ సహాయం లభిస్తుందీ, ఆ జాతకుడి జన్మనక్షత్రబలం ఉపకరిస్తుంది. నేను ప్రెశిడెంటుగా ఎన్నికైనప్పుడు, చూడలే! ఎంతముంచుకొచ్చింది. వూరిమీదికి ? నా జన్మ నక్షత్రం అలాంటిది.

హెడ్మా—దానికి నేనేం కాదనను; చూడరాదూ ! 50 ఏళ్లు నిండాయి. ఇంత శ్రమపడి ఈ ఊరిస్కూలును నిర్వహించుకువస్తున్నాను. సన్మానాలు నాకు చేస్తారనికాదుగాని—"దొరకనిచోట అముదము

చెట్టు మహావృక్ష మ" న్నట్లు-ఎవ్వరూ దొరకనప్పుడు తప్ప-నన్నెవరన్నా అధ్యక్షుణ్ణి కూర్చోపెట్టి-ఒక్క-దండ-ఏ చేనేత నూలుదన్నా సరే-మెళ్ళో వేస్తున్నారా !-దైవానుగ్రహం. జాతక ప్రభావం. Dr. సంజీవంగారన్నా, వారి భార్య సువర్ణదేవన్నా, కులదైవాల్లాగ-ప్రతియింట్లో- ప్రతినోట్లో - మెలుగుతున్నారు. అంతా ఎంత ? ఒక్క- నాలుగేళ్ళల్లో !

చౌదరి—ఎందుకు పూజించరూ; నాలుగేళ్ళక్రితం పన్ను పోటొస్తే పట్నం పరుగెత్తాల్సి వచ్చేది. మానాయన-వెధవ, పావలా యింజెక్షన్ చేయించుకోటానికి,-పదిమైళ్ళుపోయి వచ్చేవాడు.

ప్రశి—అసలుసంగతి ఎన్నిప్రాణాలు నిలబెట్టారు ! ! ఆ సంగతి చూడు; మొన్నమట్టుకు మొన్న చూస్తుండగా మావాడికి ముంచుకురాలే; డాక్టర్‌గారు ఏమన్నారు ? గంటసేపుకూడా నమ్మకం లేదన్నారు. ఏదో ! వారి హస్తవాశి; సువర్ణమ్మతల్లి చల్లనిచూపు-వాడి జాతకప్రభావం— !

హెడ్మా—దైవానుగ్రహం !

చౌదరి—డాక్టర్‌గారిసంగ తల్లావుంచండి. ఇంత చదువుకుని, సువర్ణమ్మగారి కేంపట్టింది-ఇలా సేవచేయటానికి ? ఆయన గారి కంటె యీ మెగారు నర్సులకంటె ఎక్కువగా-నిజానికి తల్లితండ్రుల కంటె ఎక్కువగా రోగులసేవ చేస్తున్నా రంటే....! !

సంజీ—ఏః పొగడ్తలకేంలెండి; ఉపన్యాసాల్లో పొగిడారు; సన్మాన పత్రంలో పొగిడారు; చాలమా ! ఇందులో మాదేం గొప్ప

తన్నం లేదు. నిజానికి మాకంటె మన చౌదరి మీతోకలిసి సేవచేస్తున్నాడు మాకంటె ఎక్కువగా. నిజమైన ప్రజాసేవ అదీ? అనవసరంగా ఈ కేస్కెట్లు కొని డబ్బు దండగ పెట్టారు. వీటిబదులు మరో రోగికి మంచం కొంటే బాగుండేది.

ప్రెసి—అలా అనకండి. ఒక సన్మానపత్రం చేతికిస్తే ఏం బాగుంటుంది. మంచాలకు యిప్పుడు కరువులేదుగా.

హెడ్మా—ఇంత చిన్నతనంలో మీరు చేస్తున్న సేవకు యీ వెండి బంగారాలొక లెక్కా! ఏదో ఊరి వారి భక్తి విశ్వాసాలకు తార్కాణంగా........

చౌద—ఎంత భక్తివిశ్వాసాలు లేకపోతే అనుకున్నదానికంటె రెండింతలుగా చందాలు పోగయ్యాయి.

హెడ్మా—ఆ. ఇదంతా మీ దంపతుల త్యాగశీలతకూ ఆర్తజన సేవకూ, నిదర్శనంగాచటండీ.

సంజీ—త్యాగశీలత! ఆర్తజనసేవ! (కళ్ళనీళ్ళు తిరగ్గా) క్షమించండి హెడ్మాష్టర్ గారూ! నా మనసులో ఎక్కడో కలుక్కుమంది. కాసేపు రోగుల్ని చూసి వస్తేగాని మనసు ఆగదు. రా! రా! చౌదరీ ఒక్కసారి అలావెళ్ళొద్దాం, రా.

(ఇద్దరూ వెళ్తారు హెడ్మాష్టరు ప్రెసిడెంటు నిర్ఘాంతపోయి అటే చూస్తూ నిల్చుంటారు. ఇంతలో సువర్ణ దుఃఖాన్ని దిగమింగుతూ, రెండవవైపుకివెళ్ళి టేబుల్ దగ్గర నుంచుంటుంది.)

ప్రెశి—ఏమిటిది ?

హెడ్మా—పాపం : ఎంత విశాలహృదయమో, అంత సాధు హృదయం.

ప్రెశి—మనం ఏదో అనకూడని మాట అన్నాం ! (ఆ మాటలు విన్న సువర్ణ దుఃఖం భరించలేక దుఃఖించి టేబుల్ మీద వాలి పోతుంది) ఇదేమిటి ! ! సువర్ణమ్మా........

హెడ్మా—ఎందుకమ్మా దుఃఖిస్తున్నారు? (సువర్ణ మరీ దుఃఖిస్తుంది)

ప్రెశి—ఈ సన్మాన సందర్భంలో-మన ఆసుపత్రి వార్షికోత్సవ సందర్భంలో ఎంతో సంతోషంగా వుండాల్సింది ! ఇంత సేపూ చిన్నబోయే వున్నారు. ఇప్పుడిల్లా కన్నీళ్లు పెట్టుకున్నారు. ఏమిటమ్మా మేము అనకూడని మాట అన్నామా ?

సువ—ఏంలేదు. క్షమించండి; ఈ సన్మానానికి మే మనర్హులం. ఈ పూలదండలకూ పొగడ్తలకూ మాకు అర్హతలేదు. ఈ సన్మానపత్రంలో చిన్నవాక్యంగూడా ఈ జన్మలో మాకు వర్తించదు.

ప్రెశి—మీకు వర్తించకపోతే-ప్రపంచంలో ఏ సన్మానవాక్యం-ఎవ్వ రికీ వర్తించదు.

హెడ్మా—ఇంతకూ అస్తుతి వాక్యాలవల్లనే యిలా విచారపడ్డారాఅని?

సువ—కాదు. కాదు. హెడ్మాష్టరుగారూ. కాదు. ఈ స్తుతివాక్యాలు-పూలదండలూ ఎండిపోయిన ఎడదల్లో దేన్నో కదిలించి వేశాయి. మీరందరూ మేమేదో త్యాగం సేవ చేశామను కుంటున్నారు; నిజానికి మేమేం చేయలేదు.

హెడ్మా—ఇదేమిటి? ఈ ఆసుపత్రి ఏమిటంటారు? ఈ చుట్టు ప్రక్కల పిల్లాణ్ణి ఎత్తుకొని మీపేరు తల్చుకోనిదెవరు?

సువ—అదంతా నిజమే కాని అదంతా ఎందుకు చేస్తున్నామొ-మీకు తెలియదు. ఎవ్వరికీ తెలియదు. కాని-కాని-యీ మనసును మరిపించటానికి-యీ మార్గాన్ని ఎన్నుకున్నాం-మనసును మోసం చేసుకోటానికి-మభ్యపెట్టటానికి, మరో మార్గం లేక-యీ మానవసేవకు పూనుకున్నాం-దాన్ని త్యాగం అంటారా? ఆర్తజన సేవ అంటారా? ఆమాటకు తగని బ్రతుకు మాది-మాష్టరుగారూ-ఆ త్యాగం మాలో లేనేలేదు.

హెడ్మా—అల్లా అంటారేం? మీ దంపతుల్లాగా ఆదర్శప్రాయంగా ఎవరు జీవితాన్ని గడుపుతున్నారు?

సువ—జీవితం గడుపుతున్నాం. ఆదర్శప్రాయంగానో! కాదో! మామూలు దంపతుల్లాగ మాత్రంకాదు.

హెడ్మా—ఏమంటారు!!

సువ—డాక్టరుగారూ-నేనూ, కృత్రిమమైన జీవితాన్ని గడుపుతున్నాం. ఆ కృత్రిమ దాంపత్యాన్ని మరిచి పోవటానికే ఈ త్యాగం-యీ ఆసుపత్రి-ఈ అనాధసేవ-అంతవరకే! ఇక మీద నన్నేమీ అడక్కండి.

(గబగబా లోపలికి వెళ్ళిపోతుంది. ఇద్దరూ నిర్ఘాంతపోయి నిల్చుంటారు. కాసేపటికి)

హెడ్మా—అందుకే ఈ సన్మానాలకు ఒప్పుకోరూ-ఒప్పుకున్నా సంతోషంగా ఒప్పుకోరన్నమాట

ప్రెశి—కాని-విచిత్రంగాలేమా ! ఈ వయసులో ! యీ వైరాగ్యం!

హెడ్మా—సహజంకాదు. కసకే బాధ పడ్తున్నాడు. ఏమిటో ప్రపంచం ! !

[చౌదరి, సంజీవం ప్రవేశిస్తారు]

సంజీ—ఆ వీరయ్య కాలు బాగా ముదిరిపోయింది.

చౌద—ఏ వీరయ్య ?

సంజీ—అదే. పదహారో బెడ్డు. (Bed)

చౌదరి—అతని పేరు "వెంకటాద్రి" కాదండీ?

సంజీ—ఆ-ఆ-వెంకటాద్రేనేమో ! ! మర్చిపోయాను ఇంకా యీ దండ లూగిండలూ యిక్కణ్ణించి తీసి పారెయ్యలేదేం ? ముందు వీటిని తీసిపారేయించు. సువర్ణా ! ! ఓ; సువర్ణ వెళ్ళిపోయిందా ! నువ్వు తీసుకెళ్ళు చౌదరీ వీటన్నిట్నీ లోపలకు తీసుకెళ్లు ముందు.

(చౌదరి వాటన్నింటినీ తీసుకువెళ్తాడు)

హెడ్మా—డాక్టర్‌గారూ ! నేను పెద్దవాణ్ణి. చనువు తీసుకుని నే చెప్పేది వేరేవిధంగా తలపెట్టక-వినాలి.

సంజీ—ఓ. అల్లాగే. కాని ఆ వెంకటాద్రికి ఆపరేషన్ చెయ్యకపోతే, ప్రమాదం. పట్నానికి పంపించే వ్యవధిలేదు; నేనే చెయ్యటానికి ధైర్యం చాలటంలేదు. కాని !

ప్రెశి—మాష్టరు గారనేది దాని సంగతి కాదండీ.

సంజీ—మరేమిటి ?

ప్రెశి—మీ దంపతులసంగతి.

సంజీ—ఓ! అదా! ఫర్వాలేదండీ. పిల్లా మేక గందరగోళంవుంటే ఏమో కాని ఏమీ లేనివాళ్ళం సంపాయించకపోతేనేం? వెన కెయ్యకపోతేనేం? ఏదో పదిమందికి సహాయంచేస్తే అదే సంతృప్తి.

హెడ్మా—కాని నే ననేది అదీ కాదండీ. నేను మీ కృత్రిమ దాంప త్యాన్ని గురించి విన్నాను.

సంజీ—అదా!!

హెడ్మా—జీవితాన్ని ఎదుర్కోవాలిగాని, ఇలా తప్పించుకు తిరిగితే తృప్తి వుండదు.

సంజీ—తృప్తి వుండదు. అవును-కాని నన్నేం చేయమంటారు? దీనికి కారణం నేనా! క్షమించండి-నేనని సువర్ణ చెప్పివుంటే- ఆత్మహత్య యిదివరకే చేసుకున్నాను. ప్రాణాలొదలటానికయినా నేను సిద్ధమే.

హెడ్మా—అట్లా అనకండి. మీ గుండెల్లో ఇంత క్షోభ గూడుకట్టుకుని వుండిపోయిందని ఎప్పుడూ అనుకోలేదు. జీవితంతో అందరం-కాస్తో కూస్తో-రాజీపడి కాలక్షేపం చేస్తున్నవాళ్ళమే- కాని రాజీ యిద్దరికీ అనుకూలపక్షంగా వుండాలిగాని, ఇద్దరికే ప్రతికూలంగానే వుండగూడదుగా?

సంజీ—అనుకూలానికీ-ప్రతికూలానికీ నేనేం చేశాను? వివాహం అయిపోయింది. సువర్ణ మనసుమాత్రం యివ్వలేనన్నది. ఇహ నన్నేం చేయమంటారు. మనసులేని మోడుతో కాలం

గడపమంటారా! వేరే పెళ్ళి చేసుకోమంటారా? రెండూ నా కిష్టంలేదు. [చౌదరి వస్తాడు] చౌదరీ! ఆ వీరయ్య-అహ-అదే-వెంకటాద్రి కాలుసంగతి తేల్చుకొద్దాం. పద.

చౌదరి—అది ఇప్పుడు మొదలెడ్తే తెములుతుందా-మీర్తు భోజనం గూడా చెయ్యకుండా? ఎటూగానివేళ-

సంజీ—ఫర్వాలేదు. రా. ఎట్లాగో అట్లా తంటాలు పడ్దాం.

(ఇద్దరూ వెళతారు)

ప్రెశి—మనసుకు బాధ కలిగితే ఈయన రోగుల దగ్గరకెళ్ళి బాధ మర్చిపోతున్నట్లున్నాడు.

హెడ్మా—ఏమిటీ ఖర్మ!

ప్రెశి—ఏమిటో! ఖర్మ

హెడ్మా—శి దైవానుగ్రహం!

ప్రెశి—ఒక్కొక్క గ్రహచారం.

హెడ్మా—ఇద్దరూ చదువూ సంస్కారం వున్నవాళ్లు. నాల్గేళ్ళు అయిన తర్వాత గూడా యింకా ఎడ పెడ మొహాలేమిటాఅని!!

ప్రెశి—ఏమిటో!

[సువర్ణ ప్రవేశిస్తుంది]

సువర్ణ—డాక్టర్ గారిక్కడికి వచ్చి వెళ్ళినట్లున్నారే!

ప్రెశి—ఆ-వచ్చివెళ్లారు. ఆ వెంకటాద్రికాలు బాగుచేస్తానంటూ వెళ్ళారు.

సువర్ణ—వెంకటాద్రి కాలా! అది ఆపరేషన్ చేయాలిగా.

హెడ్మా—ఏమో మరి!

సువర్ణ—అరే! భోజనంవేళవుతుంటే!! కాస్త కాఫీకూడా తాగకుండా వెళ్ళారే!

హేమ—వెళ్ళారు. అసలే మనసు బాధలో వుందేమో. బాధ మరచి పోవటానికే బహుశా వెళ్ళి వుంటారు.

సువర్ణ—బాధ. బాధే! బాధే మరి! మనసు సరిపుచ్చుకు బ్రతకటం బాధే.

ప్రెశి—బాధ కొంతవరకూ మాకూ అర్థమయింది. కాని దీనికి మీ యిద్దరిలో ఎవ్వరు కారణమో అర్థం కావటంలేదు.

సువర్ణ—కారణం ఇంకెవ్వరు? నేనే! ఆయన బాధకూ-నా బాధకూ అందరిబాధకూ కారణం నేనే.

హేమ—ఎందుకమ్మా-ఎరిగివుండీ బాధపడటం.

సువర్ణ—అదేప్రశ్న! అదేప్రశ్న అహర్నిశలూ నేనూ అడుగుకుంటాను. కాని అందుకు తగిన సమాధానం రాదు. అడిగినకొద్దీ మనసు విరిగిపోతుంది. ఏం చెయ్యమంటారు? ఏం చెప్పమంటారు? ఖర్మ అంతే యిదే నేమో!

[చౌదరి ప్రవేశం]

చౌదరి—వంతెన దగ్గర కారు బోల్తా కొట్టిందటండీ ఆయనెవరో-మంచి దెబ్బలు తగిలాయి. తీసుకు వచ్చారు.

ప్రెశి—ఏ వంతెన?

చౌదరి—స్టేషన్ దగ్గర వంతెన.

హేమ—అది మరీ ఎత్తండీ. వెధవది.

చౌదరి—డాక్టర్‌గారు ఆపరేషన్‌లో వున్నారు మిమ్మల్ని చూడ

మన్నారు-అందాకా.

సువర్ణ—తీసుకురండి; తీసుకొచ్చి పడుకో బెట్టండి.

హేడ్మా—ఒకరికొకరు చేదోడుగా వున్నారు దాంపత్యంలో వా దోడుగాకూడావుంటే ఎంత బాగుండేది.

సువర్ణ—మీకు తెలియదు-మాష్టర్‌గారూ. మీకేగాదు, ఈ మనసులో బాధ ఎవ్వరికే అర్థంకాదు. ఈ మనసు ఒక మోడు, ఈ గుండె రాతిగుండె.

ప్రెశి—అంటే పెళ్ళికి ముందే ఎవరినన్నా ప్రేమించావా?

సువర్ణ—ప్రేమించాను. కాని ఈ పెళ్ళి చేసుకున్నాను.

హేడ్మా—అది ప్రపంచంలో చాలాచోట్ల చూస్తున్నాం. అందువల్ల జీవితాన్నే ఇల్లా ఎవ్వరూ చీకట్లో ముంచుకోకూడదు.

సువర్ణ—కూడదు. కాని ఎల్లా! జీవితంతో రాజీ పడటం ఎల్లా! మనసునే మోసం చేసుకోవటం! ఇంకా ఆనాటి మాటలు యీ చెవుల్ని చిల్లులు పొడిచేస్తుంటే ఎల్లా-ఎల్లా మనసును మళ్ళించుకోవటం! పెళ్ళి మాటలు జరిగాయానాడు. డాక్టర్‌గారు పెళ్ళి చూపులకొచ్చారు. చూపులు నావళ్ళంతట్నీ వెయ్యి సూదులై గుచ్చుకున్నాయి. విధికి తలవంచి నే నెదటనే కూర్చున్నాను; మనసు మాత్రం అనుదినంలాగే ఆనాడూ అతణ్ణే కల్సుకుంది. చెరవిడిన తర్వాత తనువూ మనసును చేరింది. ఆఖరిసారిగా ఆనాడు అతను వచ్చాడు.....

(ఈ సమయానికి గాయాలు తగిలిన వోయువకుణ్ణి తీసుకు వచ్చి-చౌదరి మొదలగువారు కొందరు బల్లమీద పడుకోబెట్టి వెళ్ళిపోతారు.)

వస్తూ-పదునైన మాట లెన్నో మోసుకు వచ్చాడు. ఇద్దరం కన్నీళ్ళవేడి చల్లారేఃరకూ దుఃఖించాం. ఆశలు తెగిపోయిన మనసులు-మనసులో మరిగిపోతున్న మమతలు. తెల్లవారే వరకూ కన్నీళ్లున్నాయో! కన్నీళ్ళిగిరేసరికే తెల్లవారిందో! వెళ్ళిపోతూ విడవలేని కళ్ళచూపుల తుంపుకుంటూ అత నన్నాడు "పెళ్ళిచేసుకుని నువ్వు వెళ్ళిపోతున్నావ్-వెళ్ళు నా ప్రాణాలే అరణంగా నీ వెనకనే వస్తాయి లెమ్మ" న్నాడు-అంతే. నాటి నుండి అతని మాటే వినిపించలేదు. నన్ను చూశి-ఆ జీవి ఆకాశంలోనూ-అతని చూశి అవనిమీద నేనూ, వుండి పోయాం.

చౌదరి—(దగ్గరకెళ్ళి) ఆయన్ని తీసుకొచ్చామమ్మా.

సుప—వస్తున్నాను. (తన ధోరణిలో) అంతే. కాపరానికొచ్చినా డాక్టరుగారితో ఈ వూరొచ్చేశినా, మరెక్కడికి వెళ్ళినా, చూపులా-ఆకాశంమీద-ఒట్టి కట్టై యీ ఘామీృద. దుఃఖించి ప్రయోజనంలేదు. విధి నెదిరించి బ్రతకలేం. లలాట లిఖితాన్ని తుడిచివెయ్యలేం, కాని నాకోసం-యీ మనసుకోసం - తన ప్రాణాన్నే వదలిన ప్రేమ మూర్తిని యీ హృదయంమీద నుంచి తుడిచివెయ్యటం ఎట్లా? జీవించేవున్న చిత్రాన్ని తుడిచి వెయ్యటం ఎట్లా? మనసు మార్చుకోవాలి; బ్రతుకును బాగు చేసుకోవాలి బాగుచేసుకోగలను-అతను బ్రతికుంటే. బాగు చేసుకుంటాను-అతను బ్రతికుంటే.

(గాయాలు తగిలి స్మృతి తప్పివున్న యువకుడు సువర్ణా అని కలవరిస్తాడు.)

సువ—ఆ!!

యువ—సువర్ణా.

సువ—ఎవరది?

(గబగబా వెళ్ళి ముసుగుదీశి చూస్తుంది)

యువ—సువర్ణా-(బాధగా అంటాడు.)

సువ—నువ్వా!! నువ్వా!! (ఖంగారుపడి వెనక్కి వచ్చేస్తుంది)

హెడ్మా—ఎవరు? ఎవరమ్మా ఆయనా?

ప్రెశి—ఎరుగున్నవాడా.

సువ—ఎరిగున్నవాడే. తెలిసినవాడే. (వెళ్ళిచూసి) ఏమీ మార లేదు; విచారంతో కుమిలిపోయిన మొహం, పైకి దెబ్బలేమీ కనిపించటంలేదు. స్మృతిమాత్రంలేదు. - మెదడే దెబ్బతిన్న దేమో! (నాడి పరీక్షచేసి కనుపాపలు పరీక్షించి) డాక్టరుగార్ని త్వరగా రమ్మను. చౌదరీ ఏంచెయ్యాలో నాకేం తెలియటం లేదు. (చౌదరి పరుగెత్తుతాడు) అబ్బబ్బ! పెళ్ళికే మర్మహా ర్తాన ఒప్పుకున్నానో గాని, నావల్ల అందరికీ బాధే! ఒకర్ని సుఖపెట్టలేను. నేను సుఖ పడలేను. (యువకుని వంకచూస్తూ) పాపం! బ్రతికే వున్నాడు. అంత దెబ్బ తగిలినా - బ్రతికే వున్నాడు. ఫర్వాలేదు-బ్రతుకుతాడు డాక్టరుగారొచ్చిచూశి మందిచ్చేదాకా జాగ్రత్తగా వుంటే-ఆ తర్వాత ఫరవాలేదు. మనం బ్రతికి బయటపడ్డట్టే. ఆనాడే ఆత్మహత్య చేసుకుంటే

ఏమవ్వేదో! ఏదైనా మంచిదే అయింది. ఇలా వచ్చి ప్రమాదవశాత్తు మన ఆస్పత్రికి రావటంగూడా మంచిదే అయింది. ఆనాడు ఆత్మహత్య చేసుకుని ప్రాణాలు ఒదిలినా ఈనాడు ప్రమాదవశాత్తూ ప్రాణాలు పోయినా-నా విచారం నాకు మిగిలేది. మాష్టరుగారూ! మీరు చూడండి! నాడి యింకా ఆడుతూనేవుందికాదూ? ఒక్కసారి మీరుకూడా, చూసి చెప్పండి; నాకూ ధైర్యంగా వుంటుంది.

హెడ్మా—(చూసి) నాడి బాగానే వుందమ్మా.

ప్రెసి—బంగారు పడకండి; కూర్చోండి. అయితే చిన్నప్పుడు మిమ్మల్ని ప్రేమించిన ఆయన ఇతనేనా ఏమిటి?

సువ—ఆ!!....ఆ!! కాదు. ఇతను కాదు. ఇతనెవరో, వస్తాను. మీరు డాక్టరుగారొచ్చేదాకా కాస్త జాగ్రత్తగా, చూస్తూ వుండం డితన్ని. నేను....నా వంట్లో....బాగాలేదు. నే వెళ్తాను. ఇక్కడ వుండలేను. వెళ్తాను. (వెళ్ళి పోతుంది)

హెడ్మా—ఏమిటీ భగవద్విలాసం!!

ప్రెసి—అదే మరి, జాతక ప్రభావం! అయితే ఇప్పుడేమవుతుందో- ఆ డాక్టరుగారి కీసంగతి తెలిస్తే....!!

హెడ్మా—తెలియ నివ్వగూడదు. తెలిస్తే విరక్తిలో ఎవరు ఏం చేస్తారో....

ప్రెసి—సరే. అసలే నివురు గప్పిన నిప్పు డాక్టరుగారి మనస్సు.

హెడ్మా—మనం కాస్త జాగ్రత్తగా కనిపెట్టివుందాం.

ప్రెశి—ఇతనూ యిదే సమయానికి వచ్చాడు, చూడండి!!

హెడ్మా—రావటమే మంచిదయింది. బ్రతికి వున్నాడు గనక ఆమె మనస్సు మార్చుకోవచ్చు.

ప్రెశి—అవును. "బ్రతికుంటే-బ్రతుకు బాగుచేసుకోగలను అంది" యిందాక.

(యువకుడు "సువర్ణా" అని కలవరిస్తాడు)

హెడ్మా—ఏదో మాట్లాడుతున్నాడు.

ప్రెశి—ఆ కనురెప్పలమీద విచారభారం చూడండి. ఆ పెదిమలు కదుల్తున్నాయి.

హెడ్మా—కాని మనసులో మడతలు విడివడటంలేదు.

ప్రెశి—ఆగండీ-ఏదో మాట్లాడుతున్నాడు.

యువ—(కలవరిస్తూ) నువ్వే నా ఆశల పోషించావ్. నువ్వే పూడ్చిపెట్టావు. నువ్వే నా మనోరంగాన్నేలుకున్నావ్- నువ్వే దోచుకున్నావ్. నువ్వే నా హృదయాన్ని మధురమయిన నినాదాల నింపివేశావ్-నువ్వే విషాదంగా అంతలోనె మార్చి **వేశావ్.**

ప్రెశి—పాపం!!

హెడ్మా—ఇతను కవో!! ఆ వస్తువే అలాంటిదో!!

ప్రెశి—వినండి.

యువ—తెగిపోయిన గాలిపటం-విశాల విశ్వంలో మాయమయినట్లు నా మనోరంగంలో నీ మనసెక్కడుందో, వెతికినా, కన

పడట్టంలేదు. వెతకటంలోనే బ్రతుకంతా చితికి చివికి పోతున్నది.

ప్రెశి—ఆమె అన్నట్లు-ముగ్గురూ బాధపడ్తున్నారు. ఈ బాధకంటే- అయ్తితే అయింది-ఇప్పటికన్నా విడిపోవటమే మంచిదేమొ!

[Dr. సంజీవం గబగబా వస్తాడు]

హెడ్మా—అప్పుడే మీ ఆపరేషన్ అయిపోయిందా!

సంజీ—ఏదో ఒకవిధంగా పూర్తిచేశాను. ఎవరికో దెబ్బతగిలితే తీసుకు వచ్చారట. ఈయనేనా!

హెడ్మా—ఆ! ఈయనే!!

(వెళ్ళి పరీక్ష చేస్తుంటాడు)

యువ—సువర్ణా! సువర్ణా! పెళ్ళిచేసుకుని నువ్వెళ్ళిపోతున్నావ్; వెళ్లు. నా ప్రాణాలే నీ కరణంగా నీ వెనకనే వస్తాయి.

(పరీక్ష ఆపి సంజీవరావు నిర్ఘాంతపోయి నుంచుంటాడు)

హెడ్మా—ఏవో సంధిమాటలు!!

సంజీ—అవును. సంధే.

యువ—నా ప్రాణాలే నీ కరణంగా ఇస్తున్నాను తీసుకుపో సువర్ణా.

సంజీ—సువర్ణా! సువర్ణా!

ప్రెసి—ఏం? అతని కెట్లా వుందండీ?

హెడ్మా—ఆమె నెందుకు పిలుస్తారు?

ప్రెశి—మరేం ప్రమాదం లేదుకదా!

సంజీ—కావంతీ! అతనే! ఇతనే అతను. సువర్ణ యితణ్ణి చూడలే? చూసి గుర్తించకుండా వుండా? చౌదరీ! చౌదరీ. (చౌదరి రాగా) తొందరగాపోయి మన కాంపౌండరునడిగి నా Bag.... పట్టుకురా. (చౌదరి పరుగెత్తగా) సువర్ణ యితణ్ణి గుర్తించ లేదా? గుర్తించి వూరుకుందా? ముందు ఇతనికి యింజెక్షన్ యివ్వాలి. మెదడు దిమ్మెక్కింది. అరే! గమ్మత్తుగాలేదూ? సువర్ణ యితణ్ణి చూసి సంతోషించిందా? విచారించిందా? విచారించే వుంటుంది. అంతే. విచారంతో చూడలేక, యిక్క ణ్ణించి వెళ్ళిపోయి వుంటుంది. ఏం మాష్టరుగారూ! మీ రిక్కడ లేరూ? సువర్ణను చూశలే? మాట్లాశలే? అవును-మీకేం తెలుసు. మీకేం అర్ధమౌతుంది. కాని ముందితని సంగతి చూసి....ఫర్వాలేదులెండి. తల దిమ్మెక్కిపోయి సంధిలో మాట్లాడుతున్నాడు.

(చౌదరి Bag-పట్టుకు రాగా, ఒకమందు వాసన చూపించ మని యిచ్చి మరోమందు ఇంజెక్షన్‌కూడా యిస్తాడు.)

బహుశా! మరో పదినిమిషాల్లో తెలిసి రావచ్చు-లేదా అసలు రాదు. పోతే-సువర్ణ! సువర్ణసంగతేదో ఇందాక అన్నాను గదూ, అది మరేంలేదు-ఏదో చిన్ననాటి విషయం. ఇతన్ని చిన్నతనంలో ప్రేమించింది. ఏదో చిన్నతనం. తన చిన్న తనాన్ని మర్చిపోలేక బాధపడ్తోంది. ఇప్పటికీ మర్చిపోలేకుండా వుంది. ఇక మర్చిపోతుంది, ఇక బహుశా మర్చిపోగలదు.

ఏం? మర్చిపోలేదంటారా! (నవ్వి) బహుశా! ఇతన్ని చూడంగానే, మండి పడ్తానని ఓర్చలేకపోతానని ఏవిషమో యిచ్చి పారేస్తానని, తను కలలుకంటూ వుంటుంది సువర్ణ. కాదూ? కాని–నేనదేంలేదు. నవ్వుతున్నాను. తేలిగ్గా–నాటకంలో ఏదో చూసి నవ్వినట్లుగా నవ్వేస్తున్నాను. (నవ్వి యిహ నవ్వలేక ఆగి) సువర్ణను పిలవండి–మాష్టర్ గారూ! అతనికి మెలకువ రాగానే సువర్ణ కనిపించాలి. ఇద్దరూ సంతోషించాలి. నేను వెళ్ళిపోతున్నాను. తప్పుకుంటాను. తానేపు నామాటే మరచి, గతమంతా స్మృతిలో కొస్తుంటే–సంతోషిస్తారు. సంతోషించనివ్వండి. నాకూ సంతోషమే. వాళ్ళు సంతోషిస్తుంటే నేనూ సంతోషంగానే మరణించగలను. (అని నవ్వుతూ వెళ్ళిపోతాడు)

(హెడ్మాష్టరూ ప్రెశిడెంటు మొహ మొహాలు చూసుకుంటారు)

హెడ్మా—చౌదరీ! చౌదరీ! నువ్వు డాక్టర్ గారివెంట వెళ్లు. ఏం ప్రమాదమో–తలపెడితే కొంపమునుగుతుంది.

[వాసనచూపే బాటిల్ హెడ్మాష్టరుచేతి కిచ్చి చౌదరి బయటకు వెళతాడు—ఆలోగానే సువర్ణ రెండోవైపునుంచి వస్తుంది]

సువ—(డాక్టర్ గుర్తించాడని తెలియక) ఆయ నప్పుడే వెళ్ళిపోయారేం?

హెడ్మా_ఆ-ఏంలేదూ; ఇంజెక్షన్ అదీ యిచ్చారు-కాసేపటికి తగ్గి పోతుందన్నారు.

సువ_తగ్గిపోతుం దన్నారా! ప్రమాదం లేదన్నారా! ఏం యింజెక్షన్ యిచ్చారో? (అని క్రింద అంతా వెతుకుతుంది)

ప్రెశి_ఏమిటమ్మా వెతుకుతున్నారు.

సువ_ఆ. ఆ. ఇంజెక్షన్ బుడ్డి. ఏ ఇంజెక్షన్ యిచ్చారో చూద్దామని——!

ప్రెశి_ఏదో ఘాటైనదే యిచ్చివుంటారు. 10 నిమిషాల్లో తెలివి రావచ్చు అన్నారు.

సువ_తెలివి రావచ్చన్నారా? 10 నిమిషాల్లో అయితే ఫర్వాలేదు. తెలివి వస్తుంది బ్రతుకుతాడు. సాధారణంగా నవలల్లో నాటకాలల్లో యీ సంఘటనల్లో విష మిచ్చి చంపేసేటట్లు చూపిస్తారు కాదండీ....కాని....!

ప్రెశి_అల్లా మన డాక్టర్‌గారు ఎప్పుడూ చేయరు. కానీ, ఆయన మాత్రం ఘట్టిగా ఏం చెప్పగలరు. 10 నిమిషాల్లో తెలివి రాకపోతే-ఇహ అసలు రాదన్నట్లు జ్ఞాపకం.

సువ_అసలు రాదన్నారా! నిజంగానా!! అయితే-! ఇంజెక్ష నిచ్చి ఎంతసేపయింది.

హెడ్మా_ఇప్పుడేగా! 3-4 నిమిషాలు అయిం దంతే.

సువ_మూడు నాలుగు నిమిషాలా!! ఇంకా 5-6-7 నిమిషాల్లో తెలివి రావాలి. లేకపోతే-అసలు రాదు. అసలు రాకుండా

ఏమీ యివ్వలేదుగదా? ఇంజెక్షన్ పంపుల్యాలు ఎక్కడ పడే
శారో? (వెతుకుతుంది)

ప్రెశి—నువ్వు లోపలి కెళ్ళమ్మా, నీ మనస్సేం సరిగాలేదు.

సువ—ఫర్వాలేదండీ; నాకేం ఫర్వాలేదు. కాని వాళ్ళిద్దరూ!!

హెడ్మా—అదే నే ననేదీని-పోనీ, నువ్వు డాక్టర్ గారిదగ్గరకన్నా
వెళ్ళు. ఆయనా అదోమాదిరిగా వున్నాడు.

సువ—ఆయనా!! అదో మాదిరిగానా?

హెడ్మా—ఏమిటో! మీ యిద్దరికీ అడ్డంకాకుండా సంతోషంగా
తను తప్పుకుంటానన్నట్లేదో అన్నారు.

సువ—అల్లా అన్నారా! నాకు తెలుసు. ఆయన అలాంటిమనిషే-
కాని-కాని-అలా జరగటానికి వీల్లేదు. ఆగండి. ఆయనేరీ?
ఎక్కడికి వెళ్ళారు?

హెడ్మా—ఎక్కడికెళ్ళారోగాని, మేం ఆయన వెనకనే చౌదరిని
పంపించాం-జాగ్రత్తగా చూస్తుండమని.

సువ—చౌదరిని పంపించారా? సరిగ్గా చెప్పి పంపించారా! ఏమో!
ఒక్కసారి ఆయన్ని చూడాలి. చూసివస్తానాగండి.

హెడ్మా—వెళ్ళిరా. మే మిద్దరం ఇక్కడే వుంటాం.

సువ—వెళ్ళొస్తాను. ఇతన్ని-ఇతన్ని జాగ్రతగా చూస్తూవుండండి.
తెలివివచ్చేదాకా, అది వాసనచూపిస్తూ వుండండి. (వెళుతుంది)

ప్రెశి—పాపం.

హెడ్మా—ఆ పరమేశ్వరుడి విద్వాలాసం :

ప్రెశి—గ్రహచార మెట్లాగుందోగాని ఇది ఎటుతేల్తుందో చెప్పటానికి తరంగాకుండావుంది.

హెడ్మా—ఈయనికి తెలివి వొచ్చిం తర్వాతగాని తేలదు.

ప్రెశి—నామట్టుకు నాకు - డాక్టర్‌గారు వీళ్ళిద్దరికీ పెళ్ళిచేసి - వెళ్ళిపొమ్మంటారనిపిస్తోంది.

హెడ్మా—ఏమో ! ఇతనికి తెలివిరాంగానే క్షమార్పణకోరి-నిమ్మదిగా తప్పుకుపోతే హాయిగా వుంటుంది.

ప్రెశి—అయినా వేరే పెళ్ళికొప్పుకుని నాలుగేళ్ల కాపురం చేసిన తర్వాతగూడా చిన్నప్పుడేదో జరిగిపోయిన సంగతి మనస్సును ఇంత బాధపెడ్తుందంటారా ?

హెడ్మా—ఆ బాధ పడటం సామాన్యమే గాని బహుశాః ఈమె మాటల్ని బట్టి చూస్తే తనకోసం ఆతను ప్రాణా లొదిలాడని, పెళ్ళయిన తర్వాతే ఎక్కువ బాధపడ్డట్టు తోస్తుంది.

ప్రెశి—అయితే యితన్ని ప్రేమించి మరి డాక్టర్‌గార్నెందుకు పెళ్ళి చేసుకుంది ?

హెడ్మా—దానికేం కారణాలున్నాయో - అంతకుముందు, నిజానికి ప్రేమించిందో-లేదో.

ప్రెశి—ఏమో ! ప్రేమ విఫలమయినా ప్రాణాలు తీసుకుంటాడని అనుకోలేదోమో !

హెడ్మా—ఏమో !

ప్రెసి—ఏమి! ఆగండి: ఇతను కదులుతున్నట్లున్నాడు.

హేమ—ఆ. కదిలాడు.

ప్రెసి—అదిగో; కళ్ళుకూడా తెరిచాడు.

(యువకుడు లేచి అటూ యిటూ చూస్తాడు)

యువ—ఏమిటిది-నేను!! నేను ఎక్కడున్నాను!! ఇదెవరిల్లు? ఆస్పత్రా?

హేమ—ఆ ఆస్పత్రే. మీరు....మీదేవూరు?

యువ—బెజవాడ,

హేమ—పేరు?

యువ—జయరావు. నా కారు-కారెక్కడ?

హేమ—అక్కడే! పడిన చోటనే వుంటుంది. కాసేపు పడుకో తర్వాత దాని సంగతి చూద్దాం!

జయ—ఫర్వాలేదు లెండి. కారు వంతెన దాటించాను: అందాకా జ్ఞాపకముంది. అంతే అక్కడ కళ్లు తిరిగినట్లున్నాయి ఇంతకూ ఇది ఎవరి హాస్పటలు?

హేమ—Dr. సంజీవరావుగారి-ఆస్పత్రి.

జయ—సంజీవరావుగారా!! ఏ సంజీవరావుగారూ?

హేమ—Dr. P. సంజీవరావుగారు. మీరెరగరేమోలేండి.

జయ—Dr. P. సంజీవరావుగారా! ఆగండి-(ఆలోచించి) ఆ! సంజీవరావే; వారిభార్య సువర్ణ....

హేడ్మా— ఆ అవును. అదే-అయితే మీకు డాక్టర్‌గారు తెలుసా?

జయ—ఆ-ఆ- తెలుసు. కాని.... నేను వెళ్ళాలి. తొందరగా వెళ్లాలి. కాస్త ఎవరినన్నా పంపండి కారుదాకా!

ప్రెశి—ఆగండి. కాస్త విశ్రాంతి తీసుకోండి.

జయ—ఒద్దు. ఇక్కడకాదు-ఇంటికిపోయి విశ్రాంతి తీసుకుంటా- ఇక్కడుంటే అసలు విశ్రాంతే వుండదు.

ప్రెశి—ఆగండి. డాక్టరుగారొస్తారు. వచ్చినతర్వాత - వెళ్ళ వచ్చుంటే-అప్పుడు వెళ్దురుగాని.

జయ—మీకు తెలియదండీ, నే తొందరగా వెళ్లాలి. సువర్ణ-సువర్ణ- నన్ను చూడలేదుగదా!

హేడ్మా—చూశారు.

జయ—చూశిందా! గుర్తించలేదా? గుర్తించకుండా వుంటుందా!!

హేడ్మా—గుర్తించారు. దంపతు లిద్దరూ మిమ్మల్ని గుర్తించారు.

ప్రెశి—గుర్తించి-అనవసరంగా మనసులు బాధపెట్టుకున్నారు గూడా?

జయ—బాధా! అయితే, సువర్ణ సంగతీ నాసంగతీ డాక్టరుగారికి తెలిసిపోయిందా?

హేడ్మా—ఇదివరకే తెలుసు.

జయ—ఇదివరకే తెలుసా? అయితే ఇప్పుడు నన్ను చూడంగానే యిద్దరికీ మళ్ళీ కలతలారంభమయ్యాయా? డాక్టరుగారు సువర్ణ నేమన్నా అన్నారా?

ప్రెసి—ఆయనేమీ అనలేదు. అనకుండానే ఆమె మరింత బాధ పడ్తోంది.

జయ—బాధపడ్తోందా ? అవును. బాధపడ్తుంది నాకు తెలుసు: బాధపడ్తుంది. ఈ నాలుగయిదు సంవత్సరాలూగూడా బాధ పడ్తూనే వుంటుంది. My god! ఆలోచన లేకుండా అన్నా నామాట! అనకుండా-పైకి అనకుండా ఎక్కడో అజ్ఞాతంగా ప్రాణాలొదిల్తే ఎంత బాగుండేది. సువర్ణ అంతా నిమ్మదిగా మరచిపోయి వుండేది. ఏం లాభం నోరు జారినతర్వాత ? అబ్బబ్బా!! నే వెళ్ళిపోవాలండీ ఇక్కణ్ణించి. తొందరగా వెళ్లిపోవాలి; డాక్టర్ గారికి Thanks చెప్పండి. ఏ గోలా జరగక ముందే నే నిక్కణ్ణించి వెళ్ళిపోవాలి.

ప్రెసి—గోలకేం భాగ్యం ? చాలా జరిగింది.

కొండా—అదంతా యిప్పుడెందుకులెండి.

జయ—గోల జరిగిందా ? ఏం గోల! డాక్టరుగారు సువర్ణనే హింసించ లేదుగదా మాట్లాడరేం ? ఏమన్నా చేస్తే-చెప్పండి. నేనేం చేస్తైనాసరే వార్ని ప్రార్థిస్తాను. బతిమాల్తాను. ఏం చేసైనా సువర్ణ జీవితాన్ని పాడుచెయ్యవద్దని ప్రమాణం చేయించుకుంటాను.—నా జీవితాన్ని నేను నాశనం చేసుకున్నాను. వాళ్ళిద్దరూకూడా ఎందుకు పాడవాలి చెప్పండి-ఏమన్నారు ? మాట్లాడరేం ? మాట్లాడరేమండీ ? వాళ్ళిద్దరూ ఏరీ ? ఎక్కడున్నారు ? పదండి నేను మాట్లాడ్తాను మాట్లాడరేమండీ!

మిమ్మల్నిచూస్తే నాకేదో అనుమానంగావుంది. సువర్ణను,- డాక్టరుగారేమన్నాచేశారా మిమ్మల్ని బ్రతిమాలుకుంటాను చెప్పండి.

హెడ్మా—ఏం చెప్పమంటావయ్యా ? ఏదో ప్రశాంతంగా నడచి పోతున్న డాక్టరుగారి జీవితంలో కలతలు లేపటాన్కి-వచ్చి. నట్లున్నావ్ ! విధివైపరీత్యం కాకపోతే, ఏమిటిది ? ఆదంపతు లింతకాలం ఆత్మశాంతి లేకుండావున్నారంటే ! !

జయ—ఆత్మశాంతి లేకుండా ఉన్నారా ? ఇంతకాలం ! !

హెడ్మా—ఆ. లేరూ, నీవ్వాఖరన అన్నమాటలా, సువర్ణమర్చిపో లేక, నానా బాధ పడ్తోంది. నిమట్టుకు నువ్వు ఆత్మహత్యాలేదు పాడూలేదు. శుభ్రంగా తిరుగు తున్నావు.

జయ—శుభ్రంగానే తిరుగుతున్నాను. ఆవేళ ఆవేశంలో ఆమాట అన్నాను. ఆమెను బాధించాలనే ఆమాటన్నాను. కాని ఆత్మ హత్య చేసుకోనూలేదు, సువర్ణను మరచిపోకుండా వుండనూ లేదు. మళ్ళా యీ సంజీవరావుగారిపేరు విన్న తర్వాత సువర్ణ గుర్తుకొచ్చింది.

ప్రెశి—సంజీవరావుగారిపేరు విన్న తర్వాతనా ! మరి సంధి మాటల్లోగూడా, ఆ మాటనే అన్నారు.

జయ—సంధిమాటల్లోనా ?

హెడ్మా—ఆ ! సంధిమాటల్లో ! !

జయ—అన్నానా!! ఏమో! ఆనాటిబాధ మనసులో ఏమూల దాక్కుందో! అన్నానేమొ! కాని నాకేం తెలియదు.

ప్రెసి—బాగానే వుంది.... అదిగో డాక్టరుగారు వస్తున్నారు.

[డాక్టరు. సంజీవరావు సువర్ణా వస్తారు]

సంజీ—(వస్తూనే) లేచారా? తెలివి తొందరగానే వచ్చింది. సువర్ణా. ఇక జరిగిందంతా మర్చిపోవచ్చు-ఎవరిళ్ళకు వాళ్ళు పోవచ్చు. మీకారు మా డ్రైవరు బాగుచేస్తున్నాడు. ఫర్వా లేదు. మీ సువర్ణనుగూడా తీసుకువెళ్ళండి.

జయ—క్షమించండి; ఈ ప్రమాదంవల్లగాని లేకపోతే, నే నెప్పుడూ, మీ జీవితంలో జోక్యం కల్గజేసుకునేవాణ్ణికాదు. నిజానికి, ప్రేమంటే బాధపడటం కాకూడదు. సువర్ణను నేను ప్రేమిం చినమాట నిజమే కాని నామాట సువర్ణనింత బాధపెట్టిందని విని ఆమాట అన్నందుకు నేనే బాధపడ్తున్నాను.

సంజీ—బాధపడనక్కర్లేదు. బాధపడిప్రయోజనంలేదు. మనసున్న చోటే మనిషి వుండటం మంచిది. సువర్ణ మిమ్మల్ని మరిచిపో లేకుండా వుంది. ఆ బాధ ఈ కళ్ళారా చూడలేను. నాబాధ నే పడ్తాను. మీరిద్దరూ కలిసి వెళ్ళండి. మీ కాఠీపాటికి బాగుపడే వుంటుంది. సువర్ణా!నువ్వేం సంకోచించ నక్కర్లేదు. సంతో షంగా నేను ఒప్పుకుంటున్నాను.

సువ—నేను ఒప్పుకోవటంలేదు.

సంజీ—అదేమిటి - ఇప్పుడిల్లాగంటావ్? నువ్వీయన్నే ప్రేమించావుగా?

సువ—ప్రేమిస్తే మిమ్మల్ని ఎందుకు పెళ్ళి చేసుకుంటాను?

సంజీ—మరిన్నాళ్ళూ యీ బాధ?!!

సువ—బాధ! బాధపడ్డమాటా! మనసు నిల్పుకోనిమాట నిజమే. నాకోసం ఒకవ్యక్తి ఆత్మహత్య చేసుకున్నాడనే నమ్మకం తలుచుకున్నప్పుడల్లా హృదయాన్ని నీరుచేసేసేది. ఇప్పుడితణ్ణి-కంటితో చూశాను. కనక ఆబాధ యిహలేదు. నేను వెళ్ళాల్సిన అవసరమూలేదు. ఉండి బాధపడాల్సిన అవుసరమూ లేదు.

సంజీ—కాని ఉండి బాధపడకుండా ఉంటావని నమ్మకం నాకూ లేదు. బాధపడుతూ వుంటే చూసి ఓర్చగలనన్న నమ్మకం అసలు లేదు.

సువ—నమ్మకం నేను కలిగించగలను. రండి ఇక యీ ఆసుపత్రి మనసును మోసం చేసుకోవటానికిగాక, మనసు తర్గించుకోటానికి మార్గం చేసుకుందాము.

సంజీ—కాని,—కాని,—యీ నాలుగేళ్ళ బాధ నేను మరిచిపోలేను.

సువ—కాని క్షమించగలరు?

సంజీ—ఎట్లా?? ఎట్లా క్షమించగలను.

సువ—మీమీద నాకున్న ప్రేమను చూసే. మీ బాధ చూసి నేనెంత బాధపడేదాన్ని యీ నాలుగేళ్ళూ? ఆ బాధలోనే మిమ్మల్ని ప్రేమించటం కూడా నేర్చుకున్నాను.

సంజీ—సువర్ణా !

సువ—నాకు తెలుసు. మీరు క్షమించగలరు. నన్ను క్షమించి సంతోషంగా అతన్ని పంపివెయ్యగలరు. క్షమించి సంతోషంగా నన్నుండనివ్వండి.

[చౌదరి గబగబా ప్రవేశిస్తూ]

చౌదరి—ఆకారు లాభంలేదుటండీ ! ఇప్పు డప్పుడే బాగుపడదట. నానాతంటాలుపడి మన Driver తేల్చి చెప్పాడు.

జయ—బాగుపడదు. దాన్ని ఎక్కడో దూరంగా దోవ కడ్డం లేకుండా వదిలెయ్యండి. డాక్టరుగారూ ! మీకు చాలా కృతజ్ఞుణ్ణి. ఈ రోగిని మీరు ఎంత త్వరగా మరచిపోతానంటే అంత కృతజ్ఞుణ్ణి. సెలవిప్పించండి. సువర్ణా ! క్షమించు. వస్తా-(వెళతాడు)

హెడ్మా—ఇప్పటికి నా క్కాస్త అర్థమయినట్లుంది.

ప్రెశి—ఏమని ?

హెడ్మా—ప్రేమించటం కంటే—ప్రేమస్మృతిని మరచిపోవటం కష్టమని.

ప్రెశి—ఏమో ! నా కర్థమయిం దల్లా ఒక్కటే !

హెడ్మా—అదేమిటి ?

ప్రెశి—గ్రహచారం కలిసివస్తే అంతా సులభమేనని.

హెడ్మా—కాదు. ఆ కర్మ సిద్ధాంతాల్ని యివ్వాళ ఖండించాల్సి వస్తోంది.

ప్రెశి—ఏం ?

హేమా—అది మార్గాంతరం లేనప్పుడు, మనసును మోసంచేసుకు
బ్రతకటం. మనసును మోసంచేసుకోవటం మరింతబాధ.
కనక ధైర్యంగా బ్రతుకును బాగుచేసుకోవటం మంచిది.

సువ—బాగుచేసుకోవాలి. కాని, పూర్వస్మృతులన్నీ ఉంచుకొని
బ్రతుకును బాగుచేసుకోవటం మాత్రం అంత తేలికగాదు.

(అందరూ నవ్వుతారు)

ప్రెశి—రండి పోదాం. ఈ వార్షికోత్సవం యిల్లా ఆనందదాయ
కంగామారినందుకు మరొక్కసారి కాఫీత్రాగి ఆనందిద్దాం
పదండి.

(అందరూ లోపలికి వెళతారు)

—: తె ర :—

రంగ—ఆ! నే నొకరోజున రోడ్డుమీద పోతున్నాను.

రామం—ఏ రోడ్డురా!

రంగ—అదంతా చెప్పకూడదులే—ఒకచోట—కిలకిలా నవ్వు వినిపించింది. "ఎవరా" అని యిట్లా చూశాను. అది ఒక అమ్మాయి; ఇహ ఆరోజునించీ రోజూ అచ్చే తిరుగుతున్నాను.

రామం—రోజూ నవ్వు వినిపించిందా!

రంగ—అహ! మళ్ళీ పదిహేనురోజులదాకా వినిపించలేదు. పదిహేనవరోజున ఎనిమిదిగంటలకి చీకట్లో మళ్ళీ వినిపించింది. ఈ సారి తోటలో ఆ అమ్మాయి తిరుగుతూ—తిరుగుతూ, ఇంత పెద్ద కంకరరాయి నామీదకు విసిరేశింది.

రామం—కంకరరాయే!!

రంగ—ఆ. కంకరరాయే; ఇంతపెద్దది. భుజంమీద పడింది.

రామం—ఇదెక్కడి ప్రేమరా? కంకరాళ్లు విసరటం.

రంగ—ఏం? కంకరరాళ్లు విసిరితే ప్రేమకాదా?

రామం—ప్రేమేలే! కాని. అంత పెద్ద కంకరరాయా!

రంగ—అంతపెద్దరాయి విసిరితే, నేసంతపెద్దప్రేమేమో అనుకున్నాను.

రామం—ఇహ ఎప్పుడూ అల్లా అనుకోకు. ఎంత పెద్దరాయయితే అంత చిన్నప్రేమన్నమాట.

రంగ—కాదురా! పెద్దప్రేమ. ఉత్తరం చదివితే తెలిసింది.

రామం—ఉత్తర మేమిటి?

రంగ—ఉత్తరమే! ఆ రాయికి ఒక ఉత్తరం కట్టివుంది.